# వృథలసత్యాగ్రహం

విశ్వనాధ సత్యనారాయణ

ఉషా పబ్లిషర్సు,
విజయవాడ.

# పులుల సత్యాగ్రహం

[ వ్యాజకథ ]

విశ్వనాథ సత్యనారాయణ

ఉమా పబ్లిషర్సు
విజయవాడ - 1.

ప్రథమ ముద్రణ
౧౯౫౪.

వెల : రూపాయిన్నర

ముద్రణ :
కల్యాణి ప్రెస్,
విజయవాడ.

# పులుల సత్యాగ్రహం

## ౧

అది మలకలవాగు

అది వర్షాకాలం

అది అడవి

అది ఒక అడవిపల్లెసమీపప్రదేశం; చుట్టూ కొండలు.

వర్షాకాలంకదా అని ఆ వాగులో ఎప్పుడూ నిండా నీళ్లువుండవు. ఏతావాతా ఆ వాగు పుట్టి పదిమైళ్ళలోపు. ఆ పదిమైళ్ళఎగువన వానకురవటమేమిటి యిక్కడకు రావటమేమిటి, నీళ్ళు యిక్కడనుంచి వెళ్ళిపోవటమేమిటి అంతా గంటలమీదపని. అంటే ఆ వాగులో ఎప్పుడూ నీళ్ళు వుండవన్నమాట.

ఆ పల్లెటూరిలోనిపశువులుగాని కొంటెపిల్లవాళ్ళుకాని వాగు వచ్చిందంటే పదినిమిషాలు పరకాయించి చూస్తారు. తర్వాత యథేచ్ఛంగా వెళ్తారు.

ఈ వాగుసంగతి పిల్లవాళ్ళకుమాత్రమే తెలియటం ఏమిటి, పశువులకూ తెలుసు. పులులుమాత్రం పశువులు కావా, వాటికీ తెలుసు. ఆవులకూ ఎడ్లకూ దున్నపోతులకూ గేదెలకూ మేకలకూ ఉన్నంత తెలివి పెద్దపులులకుండదా?

అన్నట్టే మాట్లాడితే వాటి కింకా ఎక్కువ తెలివి వుంటుంది.

అదేమిటయ్యా మనుష్యులలో తిరిగే జంతువు లివియూయె. తెలివి వీటి కెక్కువఉండాలిగదా అంటారేమో! తెలివిఅంటే మనిషికే వుంటుందనా మీ వుద్దేశ్యం. మనిషి ఎలా ఊహిస్తాడో అల్లా ఊహిస్తేనే తెలివిఅనా?

మనిషిమాత్రం యెల్లప్పుడూ ఒకమోస్తరుగానే ఊహిస్తాడా? మనిషంటే ఒకడేనా ఏమిటి? అవయవసంఘటనాత్మకమైన ఒక ఆకారవిశేషాన్నిబట్టి మనుష్యులందరూ ఒకజాతి గనుక మనిషిఅంటే జాతివాచకంగా వాడినాము. కాని, జాతి గుణము కాదు; స్వభావము కాదు. తెలివితేటలనేవి జాతి నాశ్రయించిఉండవు.

అందుచేత తెలివిని కొలుద్దామంటే దానికి వేరే కొలత బద్ద కావాలి. సరే యిప్పు డవన్నీ యెందుకు?

చెప్పదలచిన్దేమంటే ఆ వాగులక్షణం ఈ పశువుల కంటే ఆ పెద్దపులులకు బాగా తెలుసు.

తెలుసంటే యేమిటంటే వాగు జర్రునవచ్చిందంటే ఆ గడియో రెండుగడియలలో దానిదగ్గరకు పోగూడదురా అని పశువులకు తెలుసు.

ఈ తెలివితోపాటు కొంత తెలివితక్కువగూడా వుంది. ఏముంది? కాసేపట్లో వాగు తీసేస్తుంది. అవతలికి పోదామని అక్కడే వుంటై ఆ పశువులు.

కాదయ్యా వాగుదాటితేనే అడవి వుంది, అక్కడే పచ్చిక వుంది అని వుందా? వాగుదాటితే పెద్దఅడవి వున్న మాట నిజమే. పల్లెను అంటుకున్నది అడవి కాకపోలేదు. అక్కడ పచ్చికా లేకపోలేదు. ఆ పశువ్వులూ అలాగే ఆ పెద్ద అడవిలోకి పోతాయ్. ఈ పశువులకాపర్లూ ఆ పశువుల్ని పెద్ద అడవిలోకి తోలుకొనిపోతారు.

అసలు జంతుస్వభావమే ఇదియేమో!

మామిడిపండ్లుకొనటానికి బజారుపోతామనుకోండి; ఒక రాశి పోసివుంటుంది. ఒకడజను కొంటే ధర అదే. ఆ కాయల్లో అది పెద్ద, ఇది చిన్న అనే యేర్పాటుచేయటం చాలాకష్టం. అయినా అది యేమివ్యామోహమో. ఆ కాయ మార్చి యీ కాయ, ఈ కాయ మార్చి ఆ కాయ కనీసం ఒకసారిఅయినా రెండుసార్లయినా చేయకుండా కొనుక్కొచ్చే పెద్దమనిషి యెవరు?

ఆ కొనేఆయన మీరూ నేనూ కాదు. ఒక జమీం దారనుకొందాం. ఒక మంత్రి అనుకొందాం. కాదయ్యా వేదాంతశాస్త్రం అంతా తుదముట్టచదివిన పండితుడనుకొం దాం. అతే అంతపండితుడాయె ఆయనకుకూడా వ్యామోహ ముంటుందా అనుకుంటారేమో! ఆ పండితులు ఊరికే పుస్త కాలల్లోవున్న విషయంమ్మాత్రం తెలిసినవాడైతే పెద్ద విచారించ వక్కరలేదు; కాని, అనుభవశాలిఅయితే, కొంచెం విచారిం

హారి. నిజానికి అంత అనుభవశాలిఅయితే కాంతాకాంచనములందు వైరాగ్యం కుదురుతుందేమో! మామిడిపండ్లు కొనడంలోమాత్రం వైరాగ్యం కుదరదు.

ఏమిటయ్యారహస్యం అని అడుగుతారు. ఇది మూల ప్రకృతి. అది చావదు. అది చస్తే మామిడిపండ్లు కొనటానికే రాడు. విశేషవిషయాలలో భావనచేసి అభ్యాసంచేసి ఇంద్రియ నిగ్రహం సంపాదిస్తాడు. అల్పవిషయాలుకూడా నియమితాలు కావాలన్న ఊహాచెయ్యడు.

అందుచేత జంతుస్వభావం మోహంవైపుకే లాగుతుంది. నీవు కొంచెం పెద్దవాడేమో అని వ్యామోహపడ్డట్టుగా అక్కడి పచ్చిక ఇంకొక అంగుళం పెరిగివుందని ఆ పశువు వ్యామోహపడుతుంది. ఆ పశువువైపున వాదిస్తే మెడ అంత వంచనక్కర లేదు. అది యెక్కువ సులువు అని పశుతాభిమానులు అనవచ్చు.

అక్కడ యెక్కువగా పచ్చిక వున్నది, అక్కడకు వెళ్ళటం అజ్ఞానమేమిటి అంటారు. అజ్ఞానమంటే అసంతుష్టి. ఇక్కడ వున్న పచ్చికతో సంతుష్టిపడరాదూ? ఎందుకు పడాలి అంటే ఆ అడవిలోకిపోతే యెన్నిసార్లు పొంచివుండి యీ పశువుల్లో దేన్నో ఒకదాన్ని పెద్దపులులు వేసుకొనిపోయినవికావూ?

ఈ పశువేమో ఆ కొండమళ్ళుపుతిరిగి ఆ పొదవెనుకకు పోయి, ఆ పులి దీన్ని పట్టుకొనివేసుకపోయిందయ్యా. ఈ

పశువు అరవటానికైనా వీలైందా? అది పడుతూనే మెడపై నుంచి గొంతుకనరాలు పట్టుకొనె. దీనికంతంలోని అంభారవము అక్కడే అణగిపోయె.

ఎవరైనా దూరాన్నుంచి చూస్తే తెలిసింది లేకపోతే సాయంత్రం లెక్కలో తక్కువైతే తెలిసింది.

వేసుకుపోయే పులి యెట్లాగూ వేసుకపోతుంది. వాగు దాటకపోతేమాత్రం ఆగుతుందా అంటారా? అదేమిమాట.

గడచిన పదిసంవత్సరాలనుకోండి. ఈ పదిసంవత్సరాలలో వాగుఇవతల చచ్చిపోయిన గొడ్లెన్ని? అవతల చచ్చిపోయిన వెన్ని? ఊరికిదగ్గర అంతకంటెభద్రంకదా? అని ఎవళ్ళకుచెప్తాము ఆ సంగతి.

ఆ వూరివాళ్ళకన్న మనకెక్కువ తెలుసునా? నిన్న పులివేసుకుపోయిందాయె. ఇవ్వాళ మళ్ళీ తోలిరి. మొండితనంకూడా వైరాగ్యమా? అచ్చంగా కాదనడానికి వీలులేదా ఏమిటి ?

సరే పశువులకున్న తెలివితక్కువ ఆ పులులకున్న తెలివిగా ప్రకాశిస్తుంది.

ఇదివర కెన్నిసార్లు జరిగింది వాగు యిల్లా తీయగానే మందగా ఈ పశువులన్నీ గబగబా వాగు అవతలకు దాటిపోవటం ?

వాగు దాటగానే అన్నీ చిన్నచిన్నగుట్టలు. ఏ పశువు ఏ గుట్టవెనుకకు పోయినా పెరచోట్లకి కనబడకపోవటం, ఆ వేళకి ఆ పులి వెనక్కివచ్చి కూర్చోటం, ఒకదాన్ని వేసుక పోవటం. ఇది ఇట్లా జరుగుతూనే వున్నది.

కాదు, అచ్చంగా పశువుల్నే వేసుకుపోతయ్యా పులులు. అంటే మనుష్యులన్నూ వేసుకుపోవడం వుందిగా. భేధ మేమి టయ్యా అంటే పశువులను వేసుకపోతే తక్కువ అలజడి. మను ష్యులను వేసుకుపోతే ఎక్కువ అలజడి.

ఆ పులులకు ఇంత తెలివితేటలు ఎక్కడనుంచి వచ్చినై? అట్టే విచారిస్తే పశువుల్ని చంపితేనేగాని దాని బ్రతుకు గడ వదు. కనుక దాని ఊహా అంతా పశువులని చంపడంమీదనే వుంటుంది. అందుచేత ఆ క్రౌర్యవిషయంలో దాని తెలివితేటల ముందు ఈ పశువులేమి పనికిరావటంలేదు. ఈ పశువులకాపర్లు అంతకంటే పనికిరావటంలేదు.

ఆ పులుల్ని చంపటం మానేశారా అంటే మానివెయ్య లేదు. చంపటం అంటే విసుగెత్తి అనేక ప్రయత్నాలుచేసి ఎన్నాళ్ళకో ఒకదానిని చంపటం. ఇల్లా ఎన్నింటిని చంపితే వున్న పులులన్నింటినీ చంపటానికి వీలు?

ఎప్పటికైనాసరే పులి అనేది లేకుండా సృష్టిలో చేస్తావా?

ఓ చేస్తాము, ఆ జాతి జాతి నామమాత్రావశేషంగా చేస్తాము. మరి చెయ్యలేదా?

ఆఫ్రికాలో ఎంతచేశామో, అమెరికాలో ఎంత చేశామో, ఆస్ట్రేలియాలో ఎంతచేశామో ఇంక ఈ హిందూ దేశములో చెయ్యలేమూ?

పెద్దపులి అనే జంతువే సృష్టిలో లేకుండా చేస్తామా? ఏం చేస్తే బలేబాగుండే.

భగవంతుడు దాన్ని ఎందుకు సృష్టించాడో! ఇందులో ఇదొక ప్రశ్నయ్యా?

అదికాదయ్యా, పులివేట ఒక్క సరదా. అది ఒక నేర్పు. అదొక విద్య. పులి లేకపోతే పులివేట యెలా? పులిని వేటాడటం మూలంగా ఒక శౌర్యం ఒక ధైర్యం కొన్ని వీరలక్షణాలు మనిషిలో ఏర్పడ్తై. ఆ లక్షణాలకు దోహదంయిచ్చేది పులివేట. అందుచేత పులివేట వుండవలసిందే. అంటే పులిని నిర్మూలంగా చెయ్యరాదు.

అసలు ఇంకోటి చూశారా?

అడవిలో ఒక పులులే వున్నై అంటారా? లేళ్ళు వున్నై. దుప్పులు వున్నై. అనేక జంతువులున్నై. పులులు లేకపోతే ఈ లేళ్ళు దుప్పులు కోటానకోట్లుగా పెరిగి కాస్తపైరును మ్రింగలనిస్తయ్యా! అందుచేత లేళ్ళను చంపేందుకు పులు లుండాలసిందే. సరే, పులులను పూర్తిగా చంపగూడదు.

మరి పులులు ఊళ్ళమీదికి రాగూడదే. అన్ని పులులూ వస్తున్నై కనుకనా? వచ్చినప్పుడు చంపుదాం. అరే పులివచ్చిందీ

అది అక్కడ ఆపశువుని వేసుకుపోయింది. యిక్కడ ఈ స్త్రీని చంపుకుతింది అని పది పదిహేనుసార్లు గగ్గోలుపుట్టినతర్వాత కాని దాన్ని చంపాలని నీ వనుకోవటం లేదాయె.

అనుకున్నతర్వాత నీవు నిజంగా చంపటానికి బయలుదేర టానికి కొన్నాళ్ళుపట్టె. కాదయ్యా నీవు బయలుదేరి అడవిల్లోకి వెళ్ళడంతోటే ఇదిగోనయ్యా చంపు అని అదివచ్చి ఎదురు గుండా కూర్చుంటుందా?

నీవు దానిజాడలుతీయాలి, మాటుపెట్టాలి, దొరుకుతే దొరుకుతుంది లేకపోతే లేదు.

మరి యింతకాలము రెండురోజుల కొకసారో మూడు రోజులకొకసారో దానికీ ఆహారం కావాలిగా. ఒకగొడ్డునో ఒక మనిషినో వేసుకపోతుంది.

ఓరి బాబోయ్ ఇదేమిపాలించడమయ్యా! చచ్చినవాళ్లు చావగా మిగిలినవాళ్ళను రక్షిస్తావా? నీకు పులిమీద ఎక్కువ ప్రేమా? మనుష్యులమీద ఎక్కువప్రేమా?

ఆ పులి ఇల్లా చేయగాచేయగా పోలీసువారు వచ్చారు. అధికార్లు వచ్చారు. పరవశించారు. దొరగారు చెట్టుమీద మాటుపెట్టారు. మీరందరూకలసి ఆ పులిని చెట్టుక్రిందగా తోలండి. వారు ఒక తుపాకిదెబ్బకు దాన్ని చంపేస్తారు.

పరవశించేటప్పుడు పులి బెదరి జనంమీద కెదురు తిరుగుతుందనుకోండి! ఇంక పరవశించేజనంసంగతి చెప్పాలు!

అహో ఏమి పులివేట! ఏమి ప్రజారక్షణ! ఏమి మూల భూతమైన అజ్ఞానము!

ఈ అజ్ఞానాన్ని ఆశ్రయించి క్రూరజంతువులు ఎంత చక్కగా పొట్టపోసుకుంటున్నై. అవి క్రూరజంతువులంటూ మనుష్యులు వాటిని తెలుసుకోలేక ప్రమత్తులై వాటినోళ్ళల్లోకి ఎలా వెళ్తున్నారో! ఈ మనుష్యుల్ని పాలించే ప్రభువులు అధికార్లు వీళ్ళని ఎంత బాగా పాలిస్తున్నారు!

ఆ పల్లెపేరు దానవాయిపాలెం.

అది అడవిలో వుంది.

ఆవూరిలోనూ రాచరికోమువారు వెళ్ళి పన్నులు వసూలుచేస్తారు.

పన్నులు వసూలుచేయటం ఎందుకో తెలుసునా! "మీకు వచ్చే సర్వాపదలనుండీ మిమ్మల్ని రక్షిస్తామని అర్థం."

ఆ వాగు ప్రవహిస్తూనే ఉంది.

అటు పశువులు, ఇటు పులులు.

౨

ఆ వాగు ప్రవహిస్తూనేవుంది. అటు పశువులు; ఇటు పులులు. సామాన్యంగా పట్టుమని ఒకేసారి అరగంటకన్న నీళ్ళు ఉండవుగా. కాని అసామాన్యంగా ఒకరోజురోజల్లా వుంటాయి. దానికి కారణం ఆ ఝొగువవున్న కొండలమీద అదేపనిగా వర్షం కురవటం.

ఆ వాగు వస్తుందా అది ప్రవహిస్తూన్నంతసేపు ఇటు పశువుల కా పులులు కనిపించవు. అటుపులుల కీ పశువులు కని పించవు. నీటియొడ్డుననున్న పశువులకు ఆతలివైపుననున్న పులు లెందుకు కనిపించవు అంటే ఆ ప్రవాహం నేలమట్టానికెక్కువగా ప్రవహిస్తుంది. అట్లాఅయితే ఒడ్డుమునిగిపోవా అనవచ్చు. మునిగిపోవు. సముద్రమూ కాదు. నదుల కీ లక్షణం ఉండదు, అంటే ఆ తటములయొక్క విన్యాసం అటువంటిది.

ఆ విన్యాసం ఎట్లాంటిదైనా ఒక్కొక్కప్పుడు ఆ ఒడ్డును దాటిరావడమూ వున్నది. అందుచేత ఆ పల్లెప్రజలు తమ ఊరున్నంతమేర త్రవ్వి మన్ను కట్టగాపోస్తారు.

మఱి ఒక్కొక్కప్పుడు నీళ్ళుపొరలి వూళ్ళోకి రావటమూ వున్నది. వచ్చినప్పుడు వాకిళ్ళముందర కట్టలు పోసుకుంటారు. ఒకప్పుడు అర్ధరాత్రివేళ వచ్చిందా ఆ వాగు, ఆనాడు తెల్ల వార్లు ప్రవహించిందా వాగు. ఇళ్లలోకి చొచ్చిందా వాగు. కొన్నికొంపలు కూలదోసిందా వాగు. కొన్నిప్రాణాలు తీసిందా వాగు.

మళ్ళీ యెప్పుడు అలాచేయదని ఎలా నమ్మకం.

ఎప్పుడో నూటికికోటికి అలా వస్తుంది కాని, ఎప్పుడూ అలా ఎందుకువస్తుంది అని నమ్మకం.

ఈ రెండువిషయాల్లో ఒకదానికొకటి సంబంధంలేదు. ఒకదానిమీదనున్న విశ్వాసం రెండవదానిమీదఎందుకు ప్రసరిం

చాలో తెలియదు. పైగా అది ఎప్పుడువస్తుందో తెలియదా యెను. అసలు రాకుండావుంటుందని లేదాయెను. ఎప్పటికప్పుడు ఇప్పుడు రాలేదులే అని ధైర్యంవహించటంలో ఉన్నసబబు ఏమిటో తెలియటం లేదు.

కాలానికి తా నధికారా? ఆ ప్రవాహానికి తాను శాస్తా? నిమ్నగామియైన జలప్రవాహస్వభావాన్ని తాను శాసిస్తాడా? మనుష్యత్వం నిరుపద్రవమైంది అని తనకు బాగా తెలుసా? ఈ విశ్వాసం ఒక మూఢ విశ్వాసం.

కొంతకాలం గడచింది.

అది నిరుపద్రవంగా నడచింది.

భూతకాలంయొక్క నిరుపద్రవానికి భవిష్యత్కాలంకూడ నిరుపద్రవంగానే గడుస్తుంది అని అనుకోడానికి సంబంధం ఏమిటి?

ఈ సంబంధం మూలభూతమైన అజ్ఞానంలో ఉంది. ఈ మూలప్రకృతిని ఎట్లా పరిహరించటం? అసలు దానిని గురించి లెక్క చేయ కేమిటి?

జయమూ అన్నది వందపాళ్ళు అనుకొందాం. అందులో అరవైపాళ్లు నీవశమైతే జయింపబడకుండావున్న నలభైపాళ్లను కూడా జయించినట్లే భావనచేస్తావు.

ఒక చమత్కారం చూడండి. యుగాలు నాలుగు. త్రేతా యుగంలో ధర్మదేవతకు ఒక కాలు వుండదు. ద్వాపరంలో రెండు

కాళ్ళువుండవు. కలిలో మూడుకాళ్ళుండవు; ఒక్క కలే చెడ్డది గాని ద్వాపరం అంతచెడ్డదిగా చెప్పలేను.

పుస్తకాల్లో కలి ద్వాపరు లిద్దరూ అన్నాదమ్ములు. కాని ద్వాపరాంతందాకా కృతయుగధర్మా లేవీ పోలేదు. దేవతలు మనుష్యులకు కనిపిస్తూనేవున్నారు. వ్యాసుడు భారతం వ్రాశాడా ఆ భారతాన్ని గంధర్వలోకంలోను, దేవలోకంలోను ప్రచారంచేశాడు. అవి వున్నయ్యా లేవా అని మనకు సంశయం. బ్రహ్మ వచ్చి వాల్మీకితో మాట్లాడాడు. అది కృతయుగం అనుకుందాం. కాని ద్వాపరాంతమునకు వ్యాసమహర్షితోను మాట్లాడాడు.

ఇదంతా ఎందుకు వ్రాయవలసివచ్చిందంటే, సగం గెలుపూ గెలుపే. ఈగెలుపు తక్కినభాగాన్ని గురించి విచారించనీయదు.

గడచినకాలం ఎక్కువకాలం అది నిరుపద్రవంగా వెళ్ళిపోయింది. గడపవలసినకాలం తక్కువకాలం నెరసి అంతా నిరుపద్రవమని లెక్క. ఈ లెక్క లెక్కగానే వుంటుంది.

ఆ క్షణంలో ఆ వాగువచ్చి ముంచేస్తుంది; కొంపలార్చేస్తుంది. అజ్ఞాన మల్పమై విశేషజ్ఞానాన్ని సంపిహితంచేస్తుంది. జ్ఞానబాహుళ్యంచేసుకొని అజ్ఞానలేశాన్ని నిరాదరిస్తాం.

ఈ అజ్ఞానలేశం నిజంగా అజ్ఞానలేశమైతే ఫర్వాలేదు. అది మూలప్రకృతియైన మాయావిద్యలయొక్క బీజభూతమైన

స్వరూపం. అది వుండి వృద్ధి విస్తరించిందా అది సర్వజగత్తునీ ఆక్రమిస్తుంది.

కాదయ్యా దీనినికూడా నాశనంచేద్దాం. అక్కడ వచ్చిందిచిక్కు. అది అసలు నాశనంచేయబడుతుందా? నాశనం చేయబడే స్వభావం అసలు దానియందు వుందా అనే విషయం విచారిస్తేకదా ఆ విషయం తేలేది.

అజ్ఞానము, అవిద్య అనే రెండుమాటలు వున్నై. జ్ఞానముకానిది అజ్ఞానము. విద్యకానిది అవిద్య. వెలుగుకానిది చీకటి.

చీకటికూడా ఒకద్రవ్యమా? కొందరుతార్కికులు దానికి ద్రవ్యత్వాపాదనకోసం ప్రయత్నం చేసినట్టు తెలుస్తుంది. కాని వెలుగులేనితనమే చీకటి. వెలుగు సర్వతః వ్యాపింపచేస్తే చీకటి లేదుగా. వెలుగును సర్వతః వ్యాపింపచేయుట ఎలాగా? ఆ ప్రయత్నంచేస్తే దానియందే అంతర్నిహితమై చీకటికలిగే గుణమున్నది.

ఒకయిల్లు కడ్తాం. అది పెద్దయిల్లు. ఆ నడిమినివున్న గదిలోనికి చీకటి సహజంగానే వ్యాపిస్తున్నది.

యిల్లు వెలుతురుకోసం కట్టుకోనక్కరలేదు. గాలి, వాన ఎండ వీటిని ఆపుకోటంకోసం కట్టుకోవాలి. సర్వత్ర వెలుగుని వ్యాపింపజేసుకోవటమే పనికాదే. మరి నీకు వెలుగు ఎంత కావలసివున్నా దానినే అచ్ఛంగా స్వీకరించి దానివెంట వుండే ఈ ఆతపాదులు అక్కర్లేదుగా నీకు.

అక్కర్లేదంటే పూర్తిగా అక్కర్లేదా? నీవు తలదాచుకొనేచోట అక్కర్లేదు. నీ అన్నానికి కావలసిన సస్యాదులు పండించుకునేందుకు ఈ ఆతపవర్షాదులు కావాలి.

చమత్కారం చూడండి, నీకు కావలసినవి దేశంచేత కాలంచేత నియమితములౌతున్నై. మీకు ఇక్కడ వెలుతురు కావాలి, అక్కడ అక్కర్లేదు. అక్కడ ఎండ కావాలి. ఇక్కడ అక్కర్లేదు.

అట్లాగే నీకు ఇంకొకచోట చీకటి కావాలి. నీకు కళ్ళు జబ్బుచేసింది. ఎండను చూడలేవు. వెలుగు అక్కర్లేదు. కళ్ళు మూసుకొని ఒకచోట పడుకోవాలి. అది ఎంతచీకటిప్రదేశమైతే అంత మంచిది.

అయితే కళ్ళకుజబ్బుచేస్తే నీవేదో దొంగతనంచేస్తే అప్పుడు నీకు చీకటితో అవసరం కలుగుతోంది. అందుచేత చీకటికి అసత్పదార్థానికి ఏదోసంబంధం కనిపిస్తోంది. అందుచేత అసత్పదార్థాన్నితొలగిస్తే చీకటి అవసరం లేదు.

నిజమే, గుడ్లగూబలు వున్నై. వాటికి అసలు "దివాంధము" లనియే పేరు. వాటికి వెలుగు సుతరామూ గిట్టదు. అవీ ప్రాణులే గనుక కొన్నిప్రాణులస్వభావంలోనే చీకటి అభిమానకవస్తువుగా వుంటోందన్నమాట.

అలాంటివి వాటిని నశింపచేద్దామా?

ఈ నశింపచేయుటమనేది పెద్దపులుల విషయంలో అను

కొని కాదని సరిపుచ్చుకున్నాము. కాదూ అక్కడ ఒకటో రెండో ప్రతిపత్తులు కల్పించుకున్నాం. ఇక్కడ అవికూడా పొసగవా?

పెద్దపులులవల్ల ఏదో మనకు నష్టంవున్నది. అందుచేత వాటిని పెంచడమా? ఊడ్చడమా అని ప్రశ్న పుట్టింది. ఆ దివాంధమువల్ల నీకేమీ బాధ లేదుగా.

బాధాల్పతమత్వం ప్రయోజనాల్పతమత్వం అటువంటి చోట మనము విచారించనే విచారించము.

వెలుగు లేకపోవటం ఎక్కడ నీకు బాధాజనకత్వ హేతువుకాదో అక్కడ చీకటివుంటే నీవు దాన్ని పట్టించుకోవు. అదేపనిగా దానివల్ల నీకు బాధకలుగుతూంటే పట్టించుకుంటావుగాని లేకపోతే పోనీ దానితో నాకేమి అవసరం అంటావు.

అంధకార ప్రయత్నమే దివాంధలక్షణమైనట్లు నీకు దానివల్ల బాధలేకపోతే దానితో నాకేమిఅవసరం? దానిని నాశనము చేయవలసిన అవసరం నాకేమున్నది? అనటం నీ స్వభావంలో కొంతభాగం. ఇది అజ్ఞానంకాకపోవటంకాదుసుమా!

అందుచేత నీలో కొంతభాగం చీకటి వున్నదన్న మాట. నీలో ఏభాగం చీకటియో ఆభాగాన్ని నీవు చంపవు. నీలో యేభాగం వెలుగో ఆ భాగంలో ఎదటివాడికి చీకటుంటే ఆ చీకటిని తొలగించడానికి ప్రయత్నంచేస్తావు.

అది జ్ఞానమార్గం అంటావు; అది సర్వోత్కృష్టమార్గం అంటావు.

కాని ఒకొక్కప్పుడు ఇంకోచమత్కారంగా ప్రవర్తిస్తావు. జ్ఞానంకాని జ్ఞానాన్ని జ్ఞానంగా ప్రదర్శింపచేస్తావు. వాడేమీ చదువుకోలేదు.

మంచివైరాగ్యం కలవాడు. ఇంకొకడు ప్రస్థానత్రయం వర్ణించాడు. వాడికంటె తుచ్ఛపురుగు వాడే. కాని వీడు నీ వుద్దేశ్యంలో వాడికంటె గొప్పవాడు. నీకుకావలిస్తే నీవుచేసే యీ దుష్టకార్యాన్ని సమర్థించి పెడతాను.

ఈ పండితుడు సహజంగా వైరాగ్యవంతుడు కాకపోయినా చాలామందికి వైరాగ్యబోధ-చేయగలడు. ఆ అపండితుని వైరాగ్యం వాని ఒక్కనికే ఫలిస్తుంది. ఈరీతిగా పండితుడే గొప్పవాడు. లోకోపకార హేతువు.

ఇది ఎందుకు చెప్పానంటే ప్రతిపత్తికల్పనము మేధాద్యోతకము. యాదార్థ్యనిరూపకము కాకపోవచ్చు. అందుకు చెప్పాను.

మరి ఆ పల్లెటూళ్లో ఆ పులులనుగురించీ వాగునుగురించీ చర్చలు జరిగవనియా? లక్షోపలక్షలు జరుగుతై. దైనందినంగా జరుగుతై.

ఆ పల్లెటూరు ఎన్నివందల ఏళ్ళనాట్టీ అక్కడవున్నదో అన్నివందల ఏళ్ళనాట్టీ అట్లా జరుగుతూనేవుంది. ఒక్కటే భేదం. ఇద్దరూమాత్రం ఆ చర్చలలో జోక్యం కల్పించుకోరు; పెద్దపులివేసుకోపోయినవాడు – వాగువచ్చి మునిగిచచ్చినవాడు – వీళ్ళిద్దరూనూ.

వాళ్ళిద్దర్ని గురించి ప్రశ్న లే దసలు. ప్రశ్నఎప్పుడూ చావకండా మిగిలినవాళ్ళను గురించే.

ఇందులో మధ్యేమార్గంలో కొందరున్నారు. ఆ పులుల్ని చంపటానికి పోయి చచ్చినవాళ్లు. ఈ వాగును అరికట్టటానికి ప్రయత్నించి కొట్టుకుపోయినవాళ్లు. వీళ్ళయిద్దరిదీ వేరేతెగ. ఊరికే చచ్చిపోయినవాళ్లనుగురించి యేడ్చారు. ఈ ప్రయత్నంచేసి చచ్చిపోయినవాళ్ళనుగురించి గర్వపడ్డారు. అంటే వాళ్ళు దుఃఖానికి, వీళ్ళు గర్వానికి. హేతువులైనారు.

ఎవరికి? బ్రతికిఉన్నవాళ్ళకి.

మరికొందరు వీళ్ళల్లో కొందరల్లాగు, కొందరిల్లాగు కారాదు.

ఆ వాగు ప్రవహిస్తూనేఉంది. అటు పులులు, ఇటు పశువులు.

# 3

ఆ యూరిపేరు దానవాయపాలెమని చెప్పినాము. ఈ ఊరి కీ పే రెల్లావచ్చింది? ఇల్లావచ్చింది ఇల్లావచ్చింది అని అనేకవిధాలుగా చెప్పవచ్చు. ఎన్నిచెప్పినా ఊహలేగాని సరిగ్గా ఇలావచ్చిందని యెవరికీ తెలియదు. ఆ ఊరికి రైలు స్టేషనుకి షుమారు పందమైళ్ళదూరమైనా ఉంది. ఇందులో యేభైమైళ్లు బస్సైనా, కడమ యేభైమైళ్లు నట్టడవిలోపడి చలుగుళ్లమీద రావలసిందే. అలాంటి ఊళ్లో ఇంగ్లీషు ఎఫ్.ఏ

దాకా చదివి ఇది ఒకటిరెండుసార్లు తప్పి మానివేసినవాడొక డున్నాడు. ఆశ్చర్యమేముంది! మా నాగరకత సర్వజగత్తునా సర్వప్రదేశములందు వ్యాపించింది అన్న ఇంగ్లీషువాసిగర్వోక్తికి మృషాత్వసిద్ధిలేకుండ అతి డక్కడున్నాడు. ఉన్నాడంటే ఊరికే ఉన్నాడా? సర్వకల్యాణగుణసనాథుడై ఉన్నాడు. ఈ కల్యాణ గుణాల్లో ప్రథమం చరిత్ర. తద్గుణసనాథుడై ఉన్నాడు. చరిత్ర లేనిజాతి జాతికాదన్నట్లే చరిత్రలేనిఊరు ఊరుకాదని అతని సిద్ధాంతం. అందుచేత ఆ ఊరిచరిత్ర అతను వ్రాశాడు. వ్రాశా డంటే ఎట్లా వ్రాశాడు? సరిగా మన పెద్దపెద్ద దేశచరిత్రలు, భాషాచరిత్రలు వ్రాసినట్లే. ఒక ఆంధ్రభాషాచరిత్ర తీసుకుం దాం. ఈ చరిత్రకు ప్రథమాధ్యాయం ఏమిటి? ఆంధ్రము. తెలుగు అని రెండుమాటలున్నై. మొదలుపెట్టడంతోటే ఈ రెండుమా టలయొక్క ఉత్పత్తి ఏమిటి? ఒక్కొక్కశబ్దం పదివిధాలుగా చెప్ప వచ్చు. అంధుడనేరాక్షసుణ్ణి చంపాడు గనుక ఆంధ్రుడని ఒక డన్నాడు: వాడు పెట్టినరాజ్యం కాదు, ఆంధ్రవిష్ణువు పెట్టిన రాజ్యం. ఇట్లా ఎన్నంటే అన్ని. తెలుగు తీసుకోండి, త్రిలింగ శబ్దభవం. కాదు, త్రినగశబ్దభవం. తిలలు గోవులు ఉండేవి. ఈ ఊహాలకు అంతెక్కడ? ఏది కాదనటానికి వీలు? ఏది ఔ ననటానికి వీలు? కాని, ఇవన్నీ తెలియకపోతే చరిత్ర తెలిసి నట్లుకాదు. ఇక రెండవతరహా. ఆంధ్ర అనేశబ్దం మొదట బృహదారణ్యకంలో ఉంది. తర్వాత రామాయణంలో కన్పి స్తోంది. ఇంకోవిధంగా వ్రాస్తే ఆంధ్ర అనే ఉంది. ఓరిబాబోయ్

తత్కాలదర్శి ప్రముఖుడు తన భూతకాలిక కించిత్సంపదకు కొమ్ములు పెట్టి తలగుడ్డచుట్టి నందీశ్వరుడని పూజచేసినట్లు.

ఇంతకు ఎందుకు చెప్పామంటే ఈ దానవాయుపాలెం లోని ఇంటర్మీడియేటు మూడుసార్లు తప్పిన చరిత్ర పరిశోధకుడు దానవాయుపాలెం ఋగ్వేదకాలంనుండీ ఉన్నదని తనగ్రంథంలో ఋజువుచేశాడు. ఋగ్వేదంలో అసురశబ్దం ఉన్నది కాని, దానవ శబ్దం అంతప్రచురంగా వుందా? అంటే, రెండూ పర్యాయ పదాలే అన్నాడు. ఆ పరిశోధనలో అతడనుకొన్న ఊహ సరిపెట్టేందుకు అది ఇదంటాడు, ఇది అదంటాడు. అందుచేత నమో వాకం ప్రశాస్మహే.

అందుచేత మన కెందుకు పేచీ. దానవాయుపాలెం ఋగ్వేదకాలంనుంచీ ఉంది. ఋగ్వేదకాలం ఏమిటి? కల్పాంత కాల్లోకూడ ఉంది అని ఒప్పుకుందాం. మనం ఒప్పుకుంటే ఏం లాభం? ఈ కల్పాలు యుగాలు అత డొప్పుకోడుగా. స్పష్టంతా నాలుగు మూడు వేలసంవత్సరాలలోపుగా సరిపెట్టుకోవాలి. కాదయ్యా ఈమధ్య మహెంజోదారప్పా మొదలైనవి జరిగినవి. పదివేల వెనకదాకా వెళ్ళవచ్చును. అంటే దానికదే దీనికిదే. ఆ పటం గోడ కక్కడ కొట్టాం. చచ్చినా అక్కడనుండి తీయ టానికివీలు లేదు.

చరిత్ర పూర్తిగా వ్రాశాడు. ఆ ఊరేవరేవరో మహా రాజులు పాలించారట. పూర్వకాలంలో ఉజ్జయినీపట్టణం అదే

నట. ఎంతఐతే మనకేమి? వాగ్ప్రవహిస్తోంది. వరదలా వస్తవి. జనమూ చస్తారు. ఆ ఊళ్లో ఎక్కువమందిజనానికి అడవిలోని కాయకసరే తిండి. అడవిలోని పులులా పశువులను వేసుకొని పోతవి. అప్పుడప్పుడు మనుష్యులనువేసుకోపోతవి. ఈ మనుష్యులను పులులు వేసుకొనిపోయేందుకు మనుష్యులే కారణం. వీళ్ళల్లో ఎవరో వేటకాడునని బయలుదేరుతాడు తాతముత్తాతల నాటి తుపాకి ఒకటి పుచ్చుకొని. వాడి లక్ష్యశుద్ధి యెలాంటిదంటే వాడు తూర్పునకు బారుచేస్తే పడమరకు వెళ్ళుతుంది. అల్లాంటి వాడు పులివేటకు బయలుదేరుతాడు. ఆ దెబ్బ పులికి తగులుతుంది. ఎక్కడ తగులుతుంది? ఏ కాలికో తగులుతుంది. ఇక అది అడవిజంతువుల్ని వేటాడలేదు.

తూర్పునకుబారుచేస్తే పడమరకుపోయే గుండు పెద్ద పులికి యెలా తగులుతుంది అని ప్రశ్నిస్తారేమో! వెనకటికి ఒక పిల్లవాడు వానలో బడికి ఆలస్యంగా పోయినాడట. పంతులు ఆలస్యంగా వచ్చావేమిటీ అంటే వీధిఅంతా జలప్రవాహంగా ఉంది. బారెడువేస్తే రెండుబారలు వెనక్కిలాగుకోంది అన్నాడు. అయితే నీ వెల్లా వచ్చావురా అని అడుగుతే వెనక్కి తిరిగి ఇయిాదా నన్నాడట. అల్లాగా తగులుతుందీ దెబ్బ. అది అడవిజంతువులను వేటాడలేదు. అప్పు డేమి చేస్తుంది? అల్ప సత్వవంతములైన జంతువుల్ని చంపాలి. అడవిలో జంతువులు అమితజాగ్రత్తగా ఉంటవి. క్రోశెడుదూరాన్నుంచి పులివాసన పసిపట్టవి. పులి ఏదారిని పోయిుద్దో పులి ఎక్కడవున్నదో

లక్షవిధాలుగా కనిపెడ్తవి. వాటిని వేటాడేందుకు వాయువేగం కావాలి. ద్రాఘిమఘువపటిష్టత కావాలి. పంజాబలం కావాలి. ఈ శక్తుల్లో ఏ శక్తిని మన వేటకాడు తక్కువచేసినా మనుష్యుని నెత్తిమీదికి తెచ్చాడన్నమాటే.

పైగా పులి ఒకసారి మనుష్యునిమాంసం రుచిచూస్తే అది మళ్ళీ ఇంకోజంతువుజోలికే పోదట. మరి యిదికాకుండా ఆ పులి తల్లిపులి అనుకోండి. దానికి ముగ్గురో నలుగురో ఉన్నారు. ఆ ముగ్గురుపిల్లలు పెద్దవాళ్ళయి వాళ్ళవేట వాళ్ళు సొంతంగాచేసుకునేఈడు వచ్చేవరకు తల్లిమీదే ఆధారపడివుంటారు. ఆ తల్లి ఇల్లా నిస్సత్తువరాలైతే కొంపకొంపంతా మనుష్యమాంసం తినాల్సిందే. ఇంక చెప్పేదేమిటి? ఆ అడవిలో ఒక హిడింబ తయారైందన్నమాటే!

ఇల్లాంటి హిడింబాసంసారం ఒకటి – ఆ దానాయపాలెం సామీప్యంలో చేరింది. ఒక్కొక్కసంసారంఒకచోట చేరితే ఆ చుట్టుపట్ల సంసారాలన్నీ నిర్ధూమధామం కావాల్సిందే.

ఆ ఊరికి దానవాయపాలెమని పేరెందుకొచ్చిందో ఇరవైరకాలుగా చెప్పాడు మన చరిత్రకారుడు. అందుల్లో ఒక రకం ఏమిటంటే, ఏకచక్రపురం అదేనని, బకాసురుడు ఆ ఊరు దగ్గర తేవిణీవేశాడని, ఆ ఊళ్ళోప్రజలే వంతులువంతులుగా ఒక్కొక్కయింట్లోంచి బకాసురుడికి ఆహారం పంపించేవాళ్ళనీ, అందుచేత ఆ వూరికి దానవాయపాలెం అని పేరువచ్చిందనీ.

మీరు మాట్లాడకండా చెప్పింది అంగీకరించాలితప్ప. ఆ ఊరికి ఆ పేరు రావడానికి కిదేమికారణం? అని ప్రశ్నించటానికి వీల్లేదు. ప్రశ్నిస్తే ఆ ఊరి కా పేరురావటం ఎల్లా? పైగా యిదొక్క మార్గమే చెప్పామా? ఇరవై మార్గాలు చెప్పామయ్యే. ఏదో ఒకటి నచ్చేవాడు ఎవడో ఒకడుంటాడయ్యే. అల్లా కాకపోతే ఆయన చరిత్రకారు డెల్లాపోతాడు. అతను చరిత్రకారు డను కునేవాళ్ళు కొందరున్నారు. అందుచేత అతనైనాడు. చాలా మంది అతణ్ణి చరిత్రకారుడు కాదంటారు. నిజమే. అంటే ఏమిలాభం? అతని పరిశోధన కొందరికి నచ్చిందనుకోండి. అదృష్టవశాత్తు ఆ నచ్చినవాడు పెద్ద పలుకుబడికలవాడు. ఒక విశ్వవిద్యాలయంలో వాణ్ణి చరిత్రోపన్యాసకుడుగా చేస్తారు. అప్పుడే కాదనేవాళ్ళు ఏంచేస్తారు? కనుక దేనినీ కాదన గూడదు. అంటే చిక్కులున్నై.

ఇప్పుడు ప్రసక్తి ఏమిటి అంటే పూర్వం బకాసురుడి మూలంగా ఆ ఊరికి దానవాయపాలెం అని పేరొస్తే ఇప్పుడు పేరుమార్చాలసిన అవసరం చాలా పట్టింది. 'పులాయిపాలెం' లేకపోతే 'పులిసంసారాయిపాలెం' అని పెట్టాలి. పులిసం సారాయిపాలెమే బాగున్నదన్నారు. ఎందుచేతనంటే 'దానవ' అన్నది సంస్కృతశబ్దం. 'సంసార' సంస్కృతశబ్దం. మరి 'పులి' అన్నది వెనకున్నదిగదా! అన్న ప్రశ్నే అక్కరలేదు. అసలా వూరిపేరు పెద్దదానవాయపాలెం, చిన్నదానవాయ పాలెం అని వేరే వున్నది. ఈ రెండుదానవాయపాలాలకు మధ్య

ప్రస్న దూరం 'చిన్నగంజాం'కు 'గంజాం'కు ఉన్నదూరానికి నాలుగుకోస్లు. మరి బకాసురుడు మకాంవేసింది ఈ ప్రారి దగ్గరా? ఆ ప్రారిదగ్గరా? దీనినిగురించి లక్షచర్చ ఉన్నది. (ఈ చర్చపడేది ఆ రెండూళ్ళల్లోవాళ్ళూ కారు) ఈ చర్చ పడేదె ఎవళ్ళో కొందరు పరిశోధకులైన పండితులు. అందులో కొంతకు ఆ రెండు ఊళ్ళయొక్క ముక్కులూ మొహాలూ ఎరుగరు. ఇప్పటివాళ్ళు ఎరుగరు. యేభై ఏళ్ళక్రిందట బకాసురుడి మకాం ఈ ఊరా? ఆ ఊరా? అని పత్రికల్లో వ్యాసాలు, వాటికిఖండనాలు. ఖండనాల ముండనాలు, ముండనాల మండనాలు తెగజరిగినై. ఆరోజుల్లో ఎవణ్ణి కదలించినాసరే ఇదే గోల. ఊరికే యిద్దరుస్నేహితులుకలసి మాట్లాడుకుంటూంటే నిమిషంలో ఈ వాదంలోకి దిగటమే. ఒక్కడు చినదానవాయిపాలెం వైపు. రెండవవాడు వెంటనే పెదదానవాయిపాలెంవైపు పోట్లాడుకొని పోట్లాడుకొని, తెగక చివరికి రాత్రి 9½ గంటలకు ఇండ్లకు పోవటం.

ఇంతకథ ఉన్నది గనుకనే ఆతడు దానవాయిపాలెం చరిత్ర వ్రాశాడు.

ఇప్పుడు ఆఊరు "పులిసంసారాయిపాలెం" అయింది. ఆ ఊళ్లో కొందరు పాతపేరు మార్పించి క్రొత్తపేరు లెఖ్ఖల్లో నమోదుచేయించాలని పట్టుదలతో ఉన్నారు. ఆ ఊరికీ రాజధానినగరానికీ ఏమీ సంబంధం లేదు. ఈఊరిమనిషి

రాజధానీనగరం వెళ్లాలంటే బళ్ళకుగాని, బస్సుకుగాని, రైలుకు గాని. ఊరకే వెళ్లేందుకు నలభై రూపాయలౌతుంది. ఆ ఊళ్లో నూటికి తొంభైమందికి సాలుసరి ఆదాయం నలభైరూపాయలే రావటమే లేదు. అట్టే మాట్లాడితే ఈ తొంభైమందిలో అరవై మంది రూపాయి ఎట్లా ఉంటుందో ఎరుగరు. అందులో కనీసం ముఫ్ఫైమంది రూపాయినాణెం ఉందిఅనీ, ఆ రూపాయతో లోకంఅంతా తల్లక్రిందులు చేయవచ్చుననీ, నీటిమీద నడువ వచ్చుననీ, గాలిలో తేలిపోవచ్చుననీ, ఎక్కడిమాటో ఇక్కడ వినవచ్చుననీ, కన్నుమూసి కన్నుతెరిచేటప్పటికి ఎనభై లక్షల జనాభాగల ఒక మహానగరాన్ని భస్మీపటలము చేయవచ్చుననీ ఏవంవిధ రూపికామహాత్మ్యం మహావిషయములయొక్క పరిజ్ఞానమే వాళ్ళకు లేదు. వాళ్ళకు గొఱ్ఱెలూ, మేకలూ కలసి ఒక పది ఉంటై. ఒక పాడిబఱ్ఱె ఉంటుంది. వాటిని మళ్ళవేసు కోటం, అడవిలోని కాలిబాట కసుబు దుంప ఆకు తినటం, జీవనదియైన ఆ వాగులోనీళ్ళు త్రాగటం ఇది వాళ్ల జీవితం. వాళ్ళకి ఊరుపేరు ఏదైతేనేం?

మరి వాళ్ళ మేకలనో గొఱ్ఱెలనో పాడిగేదెలనో పులి వేసుకుపోదా? అని అడుగుతారు. ఎందుకు వేసుకపోదూ? తప్పక వేసుకుపోతుంది. వేసుకపోతే వాళ్లు అదేమిటో మొత్తం మీద మాట్లాడకుండా ఊరుకుంటారు. పులి వేసుకుపోయిం దంటారు, అంతే.

అందుచేత ఈ ఊరిపేరు మార్చటంలో వాళ్ళకేమీ సంబంధం లేదు. సంబంధం ఉన్నదో లేదో వాళ్ళా నిర్ణయించేది? ఆ ఊళ్ళో మన చరిత్రపరిశోధకుడు మరిద్దరు పెద్దలూ ఉన్నారు. వీళ్ళు ఊరిమీద తబరీకు వేశారు. వీళ్ళకి ఒకొక్కడికింత వాడి తాహతునుబట్టి, ఒక మేకపిల్లో ఒక గొఱ్ఱెయో మరీ కాకపోతే ఒక సోలెడు చారపప్పో ఒక సవాశేరు ఇప్పపువ్వో తగలనేతగిలింది.

ఇందులో ఇంకొక తగాదా బయలుదేరింది. ఊరు పేరు మార్చటం అల్లా ఉంచండి. పూర్వం బకాసురుణ్ణి భీముడు చంపినతరువాత ఆ ఊరికి దానవాయపాలెం అని పేరువచ్చిందని ఒక సిద్ధాంతం. అందుచేత తల్లిపులి దాని నలుగురు పిల్లలు ఈ ఐదు జీవాలు చచ్చింతర్వాత గాని ఊరిపేరు మార్చకూడదని. ఈ చర్చలన్నీ ఎవరు చేస్తారు? అని ప్రశ్న. రూపాయి మొహం ఎరిగినవాళ్ళున్నారే నూటకి ముప్పదిమంది, వాళ్ళు.

౪

భీముడు బకాసురుణ్ణిచంపినతర్వాతనే ఆ ఊరికి దానవాయపాలెం అని పేరువచ్చింది అన్నవిషయం సువ్యక్తమే. దాన్నిగురించి వివాదమేమిఉన్నది? దానిపూర్వమే దానవాయపాలెం అని పేరుంటే, ఈపేరు వ్యాసుడే వ్రాశేవాడు. దాన్ని నన్నయ్యభట్టుగారు అల్లాగే తెలిగించేవాడు. అందుచేత ఇది

తర్వాత వచ్చినపేరే; మరేన్నీ అందుచేత ఆ పులిసంసారం చచ్చిపోతేనేగాని ఆ ఊరికి "పులిసంసారాయపాలెం" అని పేరు పెట్టడానికి వీలు లేదు.

ఈవిషయం అందరూ ఒప్పుకొన్నారు. అందరూ ఒప్పుకున్నారంటే ఊరికే ఒప్పుకున్నారూ? సంవత్సరం హోరా హోరీ పోట్లాడుకున్న తర్వాత ఒప్పుకున్నారు.

ఆ పోట్లాట ఎట్టిదంటే బజారులో ఎదురుబడి తిట్టుకోటం, కొద్దిగా కొట్టుకోటం, తాతలతరాలనుండి ఒకరితో ఒకరు మాట్లాడకుండా ఉండటం, ఎరిగున్నట్టివాళ్లు ఆపక్షపువాడు కనిపించడంతోటే పెడమొగం పెట్టడం, సందులలోకి పోవడం, అరుగుమీద కూర్చున్నవాళ్లు ఇళ్ళలోకి పోవటం; ఇది లేతపాకం.

కొంచెం ముదిరితే మరి యిల్లాగా అవతలవాణ్ణి చూచి పడు ఉమ్మివేయటం. ప్రక్కనే కుక్కపోతూంటే వాడిమీద పెట్టి దీన్ని 'ఛీ వెధవకుక్కా' అనటం. అది చిలికిచిలికి వాన కావటం

అసలు ముదురుకావటం ఎలాగంటే పులిసంసారం ప్రత్యక్షంకానటం, అంటే పశువు అడవిలోకి మేతకుపోతుంది. మేకపిల్ల గుట్టచాటుకుపోతుంది. ఇక మళ్ళీ కనబడదు. ఏమైందీ అంటే పులి వేసుకపోయింది; పులి వేసుకపోతే నెత్తురు కనపడాలి; పులి అడుగుజాడలు కనపడాలిఅంటే అబ్బో ఆ పులులు ఎంత నేర్చినవి! గుర్తులుకూడా కనపడనిస్తేయ్యా! మనుష్యుల్లో

తిరిగే పులులాయె. మనుష్యులవిద్యలు నేర్చుకోకపోతయ్యా. అవి ఎంత గారడీ నేర్చినవి. మేకను పులివేసుకొనిపోయిన దాయెను. తనకాలిగుర్తులు కనిపించిపోతయ్యేమోనని అక్కడ మనుష్యుడికాలిగుర్తులు పెట్టిపోవటం. ఇంత ఇంద్రజాలంనేర్చిన పులులకో ఉభయలోకాలు తరించడం మొదలుపెట్టింది.

లోక మెందుకు? పరలోకం బాగాఉంటే చాలు. అటువంటి స్థితిలో ఉభయలోకతారకమైన ఈ విద్యను సంబాళించుకోలేక బాబోయి మాకు రెండులోకాలు ఎందుకు? ఒక్కలోకమే చాలునన్నారు. ఆ చాలుననటంలో లోకాలవినిమయం జరిగింది. పూర్వం పరలోకంకోసమే పాటుపడేవాళ్ళు. ఇప్పుడిహ లోకమే చాలునన్నారు.

ఎట్లా అయితేనేం అందరూ అంగీకరించారు. పులిసంసారం నిర్మూలంకావాలి. పులిసంసారాయత్తపాలెం అన్న పేరు రావాలి; అంతేగాని, యీలోపుగా ఆ పేరు పెట్టగూడదు. ఈ తీర్మానం తెలిగ్గానే చేశారనుకోండి. పైగా ఈ తీర్మానం జరిగినతర్వాత వాళ్లకు కొన్నిలాభాలుకూడా కనిపించినవనుకోండి.

ఎందుచేతనంటే? ఆవెనుక పులివేసుకపోయిందనుకొన్న కొన్నిమేకలు, పశువులు మళ్ళీ ఇళ్ళకు వచ్చినై. ఎట్లావచ్చినై అని ప్రశ్న. అబ్బో, ఈ ఊరివాళ్లందరూ కలసి మనలను నిర్మూలించేప్రయత్నించేస్తున్నారు. కనుక మనం తిన్న కొన్ని

జంతువులనైనా వాళ్ళకు తిరిగి తోలిపెట్టితే వాళ్ళు కొంత శాంతించి మన నిర్మూలనప్రయత్నం మానివేస్తారేమో అని అనుకొనిఉండాలి.

ఎల్లాగైతేనేం, అవి తిరిగివచ్చినవి.

తిరిగివచ్చినవా! ఈ మనుష్యజాతికి కృతజ్ఞత ఉండ నద్దూ. అయ్యో అంతదయగా ఆ పులులు మళ్ళి కొన్ని మృగా లనేనాయెను, తిరిగిప్రసాదించినవికదా! వాటిని నిర్మూలనంచేయ వచ్చునా? అనే కృతజ్ఞత ఉందా?

ఈసారి ఊళ్లోవాళ్ళందరూ కలసి శ్వాపదసంసారనిర్మూ లనం తప్పకండాచేయాలని తీర్మానించారు.

"కృతఘ్నాశ్చ కృతజ్ఞాశ్చ లోకే సన్త్యేవ నిత్యశః"

కారవాశ్చాథనై రాజాః లోకా అపిచ సన్తిచ" అని ఊరికే అన్నారూ? ఎవ్వళ్ళలోకాలకు వాళ్లు పోతారు, మనకేం?

కాని పులిసంసారనిర్మూలనాన్ని గురించి పూర్వం ఊళ్లోనే రెండు కక్ష్యలు అయితే యిప్పుడు ఊరంతా ఒకపక్షం. అడవిఅంతా ఒకపక్షం.

ఇహ ఈ వ్యాఘ్రపంచక మహానిర్యాణప్రయత్నం ఎలా చెయ్యాలి అన్నప్రశ్న మూడునాలుగేండ్లుగా ఆ పులు లకు మహాభోగంగా ఉంది.

ఈలోపుగా మరొక చమత్కారం జరిగింది. ఇదివరకు పిల్లపులులు. ఇవి పెద్దపులులైనై. అవి నాలుగు పులులు.

అందులో రెండు మగవి; రెండు ఆడవి. సంవత్సరం సంవత్సరం వర్షస్తుప్రు రాక మానదాయెను. వచ్చేటప్పటికల్లా అడవిలో పులిసంసారానికి అల్లుళ్లు, కోడళ్లూ వచ్చారు. వారూ వీరూ కలసి వనమంతా కిటకిటలాడిపోయింది. ఓరి బాబోయి ఇంత సంసారాన్ని మేమెక్కడ పోషించగలనన్నదా ఊరు. వాళ్లు మాత్రం ఏమంత అన్యాయస్థులా! వాళ్ళకీ తెలిసింది ఈ ఒక్కఊరు మన్నె నిభాయించుకోలేదని.

పైగా ఆ వచ్చిన అల్లుళ్లూ, కోడళ్లూ వాళ్లు రాజాన్న భోక్తలు. తుచ్ఛ మనుష్యమాంసఖాదులు కారు. అత్తవారింటి పిడిచంటగా ఏదో రుచిమాడటమే కాని సుతరాం మా కివే కావాలని కూర్చోరు. పైగా విస్తట్లో వడ్డించ్చామనకదా అదే పనిగా జుర్రితే అత్తగా రేమనుకుంటుందో, మామగా రేమనుకుంటారో, బావగార్లు నవ్విపోతారేమో! మరదలు వెక వెకాలాడుతుం దేమో అని మనస్సుల్లో కోర్కెలుఉన్నా ఆ కోర్కెచంపుకుని మర్యాదాపాటించటంమూలంగా దీనవాయ పాలెంమర్యాదా కొంచెం దక్కింది.

మరి అడవిచూస్తే పెద్దపులులను ఈనిందాకి అన్నట్టుంది. పూర్వం మనిషికంటనే పడేవికావు పెద్దపులులు. ఆ మహారాజులదర్శననే దుర్లభమయ్యేది. పూర్వపుజమీందారులకువలే ఆ పులులు దాచటివిపోయేవి. మొదట దర్శనాభావం కనిపిస్తే మహానుగ్రహంచూపించేవి. ఇప్పుడట్లా కాదే; ఎక్కడపడ్తే అక్కడే కనిపిస్తా రా జమీందారులు.

ఇంక దానవాయుపాలెంపెద్దలు శాసనసభలో బిల్లుపెట్టి వ్యాఘ్రమునిష్కాసంచేద్దామనుకున్నారు. పదిమందిభోజనం ఈ ఒక్క పులి చేస్తున్నది. అల్పమైనజంతువులు నిరాహారంగా చెల్లిపోతు న్నవి అని జాతీయసభాపక్షంవా రన్నారు. సామ్యవాదపక్షంవా రన్నారుకదా! వీటిని సంపూర్ణంగా నిర్మూలనంచేయాలి. ఇవి వందలఏండ్లుగా తిని తిని ఉన్నై. వీటిన్నాశనం లేకుండా సామాన్య జంతువుల కాహారం కుదరదన్నారు. రెండుపక్షాలు నిజానికి ఒకటేసిద్ధాంతం. ఇది నెమ్మదిగా చేస్తానంటుంది. అది వెంటనే చేస్తానంటుంది. ఇది క్రమంగా సాధుమార్గాన్ని నాశనంచేస్తా నంటుంది. అది తక్షణమే నిస్త్రింశభావంతో నాశనంచేస్తానం టుంది.

ఎట్లాఅయితేనేం పులిసంసారముయొక్క రోజులు బైటపడ్డయి.

ఇంత గగ్గోలు, గందరగోళం, చర్చ, రాద్ధాంతాలు, సిద్ధాంతాలు ఇక్కడ జరుగుతూంటే ఆ పెద్దపులులు అడవిలో మాట్లాడకండా కూర్చున్నవా? అంటారు. ఈ హంగామా అంతా వాటికి తెలియలేదా? అంటారు. ఎందుకు తెలియ లేదు; తెలిసింది. అవీ సభలుచేస్తునై. అవీ చర్చలుచేస్తు న్నవి. ఆ తల్లిపులి ఒక్కొక్క-రోజున అడవిఅంతా ఘూర్ణిల్ల అర్ధరాత్రివేళ ఆ ఊరంతా మేల్కొ-ని గుండెలుపగిలేట్లుగా మహాగర్జనంచేస్తుంది.

ఒక చమత్కారం ఉంది. ఆ పులుల కలవాటైపోయింది. ఈ మనుష్యభాష వాటికి తెలిసింది. ఈ మనుష్యులకు అలవాటైంది. ఆ పులులభాష వీళ్లకు తెలిసింది. అడవిలో ఒక వ్యాఘ్రగర్జన వినిపించిందనుకోండి. దాని మంద్ర మధ్యమ షడ్జమాలనుబట్టి నాదపరివాహశబ్దశకలసంయోగశక్తినిబట్టి ఊళ్లో పెద్దలందరూ తెలుసుకోగ్గలరు. ఆ కూసింది కొడుకుపులి, లేకపోతే కోడలుపులి, మరీకాకపోతే అల్లుడుపులి. ఇంతేకాకుండా వాటిఅర్థాలుకూడా తెలుసు.

అందుచేత ఆ తల్లిపులి అర్ధరాత్రివేళ గర్జిస్తే దాని తాత్పర్యం తెలుసుకున్నారు. దానితాత్పర్య మిది: ఒరేయ్ మనుష్యుల్లారా! మీరు మమ్మల్ని చంపదలచుకున్నారు. అది మీ తరంకాదు. మే మిప్పుడు తొమ్మండుగురం. మే మొక్కసారి వచ్చి ఊరిమీద పడితే సున్నంలోకి ఎముక లేకుండా నూరుకట్టాగేస్తాం. మీ ఊరంతా కురుక్షేత్రం చేసేస్తాం. మా గోళ్లు చంద్రవంకవంటివి. వీటితో అర్ధచంద్రపతాకలు ఊరిమీద ఎగురవేస్తాం. మారాజ్యం స్థాపిస్తాం. ఓరి పిచ్చివాళ్లల్లార! పూర్వం ఈ అడవిఅంతా మీ రాజ్యమే. మే మెంతాక్రమించుకొన్నా మో చూడండి. ఈమిగిలినది ఆక్రమించుకోలేకపోతే అప్పుడు చూస్తాం. ఒకవేళ మేం చచ్చిపోతామనుకోండి–

"హతోవా భోక్ష్యసే స్వర్గం
జిత్వావా భోక్ష్యసే మహీం."

ఆ పులితల్లిగొంక్క తాత్పర్య మిద్ధి అని తెలిసింది. మర్నాడు ప్రొద్దున్నే ఊళ్ళో పెద్దలందరూ సభచేశారు. ఆ పులుల్ని మనం ఎట్లాగూ చంపలేమన్నారు కొందరు. పిళ్లోకజాతి, ఆ పులుల పేరుపెట్టి అప్పుడప్పుడు మేకపిల్లల్ని, గొఱ్ఱెపిల్లల్ని దొంగిలిస్తూం టారు వీళ్లు. ఆ పులులు లేకపోతే వీళ్ల ఈ చిన్నదొంగతనాలు సాగవు. అందుచేత వాళ్లు పులులపార్టీ. ఓరి దీనిదుంప తెగా. అచ్చంగా పులులకు పులులు, మనుష్యులకు మనుష్యులు ఐతే! ఆ పులుల్ని ఎట్లాగో ఒకలాగా చంపవచ్చు. మనుష్యుల్లోనే కొం దరు పులులపార్టీ అయితే! అయినా చెప్పిచూచారు. ఓరీ పిచ్చి ముండాకొడుకుల్లారా! మీరు పులులపార్టీ ఏమిట్రా! మేము కనబడితే తిన్నీ మీరుకనబడితే వదిలిపెడ్తాయిట్రా ఆపులులు? అవి తినేంతమేర వాటికి మీరూ, మేమూ ఒకటే. లేకపోతే మీరు వాటిపక్షానఉండి మమ్మల్నికొందర్ని తిందామనితప్ప సామూహికంగా మనందరం మనుష్యులమూఅని, ఎంత చెపితేనేం?

"పకృతిసిద్ధమిదం హి దురాత్మనాం" అని గదా అన్నాడు.

వాళ్లవిషయం అట్లాఉంచి, తక్కినవాళ్లుకొందరు ఆ పులుల్ని మనం పరవదోలి, మాటుపెట్టి చంపాలన్నారు. మరి కొందరు ఎక్కడకనబడితే అక్కడ పొడిచి చంపెయ్యా లన్నారు. పులుల్ని పొడిచెయ్యటం ఎల్లా? వెనకటికి వాడెవడో

ఒకపుస్తకంమీద కోపంవచ్చి దాన్ని చింపివేశాడట. ఆపుస్తకం ప్రతులు లక్షఉన్న దేశంమీద. పులిని ఎదుటబడి పొడిచి చంపటమే! అందులో ఈ అంబలిత్రాగేవాళ్ళు!

మరికొందర న్నారుకదా! వాడెవడో దొర ఉన్నాడు. వాడు పెద్దవేటగాడు. వాడిని పిలిచి పంపిద్దామని.

మే: ఒకఊహాశాలి అంటే నిష్క్రియుడు అసలువిషయం ఒదిలిపెట్టి ఇల్లా అన్నాడు "చస్తే స్వర్గానికి పోతాను, బ్రతికితే భూమిని పాలిస్తానంటోంది పులి. అసలు దానికి గుండెలో డక్కాగాఉంది; మనము గెలుస్తామనేధైర్యం వాటికి లేనేలేదు" అని.

సభ అంతా ఒకసారి సంతోషించారు. నిజమేరా అంటే నిజమేనని ఎవరిదారినవాళ్లు లేచిపోయారు.



పులులు వేసుకపోతూంటవి. వేసుకపోయినప్పుడల్లా సభలు జరుగుతూంటవి. సభలుజరిగినప్పుడల్లా పులు లడవిలో గర్జిస్తుంటవి. గర్జించినతర్వాత ఊళ్ళో మళ్లీ విచారణలు సాగుతవి. ఎవడోఒకడు ఏదోవిషయం ఎత్తుకొని పులుల యొక్క అధైర్యాన్ని వర్ణిస్తాడు. అందరూ సంతోషించి ఎవరి దారినవారు పోతారు.

ఇల్లా పోగా పోగా పులులవిజృంభణ సాగిపోతోంది. ఊళ్ళో సభలుజరిగినా పులులు ఖాతరుచేయటం లేదు. పులులు

ఖాతరుచేసినన్నాళ్లు వీళ్లు కొంత సంతోషిస్తూవచ్చారు. వాటి విజృంభణ యథేచ్ఛంగా సాగుతున్నది. ఇవ్వాళప్రొద్దున్న ఇక్కడ ఒకపులి మృగాన్ని వేసుకపోయింది. రేపుప్రొద్దున్న అక్కడ ఒకముసలిది పుల్లలేరుతుంటే ఆమె నొక పులి వేసుక పోయింది. ఆసాయంతనమే మేకల్ని కాస్తూవున్న పిల్లవాణ్ణి మరొకపులి మాయంజేసింది. భాగ్యం వారానికొక్కటిగా ఉండేది. పోనుపోను రోజూ ఒకటి. మరీ రోజుకు రెండూ మూడూ ఇలా సాగింది. జనానికి తహతహ ఎక్కువైంది. ఎల్లా గంటే ఎల్లాగా? ఒక పెద్ద సభచేశారు. పులుల్ని అన్నిటినీ పట్టుకొని ఒక్కసారిగా నరకాల్నన్నారు. వాటిని తుపాకులతో పేల్చాలన్నారు. ఆపని చేసేవాళ్లెవరో కనిపించలేదు.

జనంకగ్గర రాచరికంవాళ్లు పన్నుతీసుకుంటున్నారు. వీళ్లను రక్షించవలసినబాధ్యత రాచరికంవారిమీద ఉంది. పటేలు పట్వారీలు ఆ రాచరికపుచిహ్నాలు కనుక వీళ్ళిద్దరిది ఆ బాధ్యత.

అయితే ఆ అడవిఊళ్లల్లో ముప్పైనలభై ఊళ్లకు కలిపి ఒకపటేలు, ఒకపట్వారీ ఉంటారు. వాళ్లు నెల్లాళ్లకో రెండు నెల్లకో ఒకసారి వస్తారు ఆ ఊరు జమాబందీజరుగుతుందనగా ఆ ముందర పదిహేనురోజులు ప్రతిరోజూ వస్తారు గాని, లేకపోతే వారిదర్శనమే లభించదు.

పదిఊళ్లకు మునసబుగిరి. పాతికఊళ్లకు కరిణీకం. వాళ్ల చేతుల్లో ఎంతమందిజనమైనా ఉన్నారు. వాళ్లు తలుచుకుంటే

ఈపని సాధ్యంకావాలి కాని, భానవాయపాలెంలోఉన్న మను
ష్యులు అందర్నీ పోగుచేస్తే పదికుచ్చిలు. నీళ్లవల్ల ఏమవుతుంది?

ఇట్లా ఉండగా ఆ ఊరికి పటేలువచ్చినప్పుడు పట్వారీ
రాడు. పట్వారీవచ్చినప్పుడు పటేలు రాడు. వాళ్లల్లో ఎవరో
ఒకరు మొదటిసారివచ్చినప్పుడు ఊరంతా చెప్పుకున్నారు.
పటేలన్నాడుగదా నిజమే పట్వారీవచ్చినప్పుడు ఆయనతో
కూడా చెప్పండి; నేనొక్కణ్ణే చేసేపని కాదుగదా! అన్నాడు.
ఆయనతో చెప్పమని ఈయన, ఈయనతో చెప్పమని ఆయన.
కొన్ని నెలలు గడిచినవి.

ఆ ఊళ్ళో ఒకకుఱ్ఱవాడున్నాడు. అతనికి ఆసంవత్సరమే
మైనారిటీ వెళ్ళింది. కొంచెం ఉడుకురక్తం. మనిషి పుష్టిగా
ఉంటాడు. అతడొకసారి పట్వారీతో కొంచెం గండాగొండగా
మాట్లాడాడు. "ఇదేమిటయ్యా, మాదగ్గర పన్నులువసూలు
చేయటం అంత నిష్కర్షగాచేస్తారే. అయ్యో నేం ఈ పులు
లతో చచ్చిపోతున్నామని లబ్బున మొత్తుకుంటే ఆలనా
పాలనా లేదు. నాలుగురోజులు పన్నులు చెల్లించటం వెనకా
ముందూ అయితే పాడిచేసేగేదెను జప్తుచేస్తారు. వండుకుతినే
తప్పాలాలు జప్తుచేస్తారు." అని తీక్ష్ణంగా మాట్లాడాడు.

ఉన్నమాటలే ఇవి. తీక్ష్ణమేముంది అనటంలో, కొం
చెం తీక్ష్ణంగా అన్నాడు. దానితో పట్వారీకి కోపంవచ్చింది.
ఆరునెలలమట్టి పులులబాధ తప్పించటానికి ప్రయత్నంచెయ్యా

టానికి పటేలు పట్వారీలు కలుసుకోటానికి వీలులేకపోయింది. కాని, ఆమరునాడే పట్వారీ పటేలును కలుసుకోటానికి వీలైంది. "వాడికి కొంచెం జలుబుగావుంది. వ్యవహారం చిలపచిలపగా వుంది! కొంచెం రొమ్ముబలిసింది." మొదలైన బిరుదులిచ్చి ఇద్దరూ ఒకరోజున మధ్యాహ్నం దానవాయపాలెం చేరారు. ఆ కుఱ్ఱవాడు అడవిలోకి వెళ్ళాడు. పొద్దుకూకినతర్వాత వచ్చాడు. అప్పుడు వాణ్ణి పిలిపించారు. రెక్కలువిరిచికట్టించారు. బండకొయ్యవేయించారు. తెల్లవార్లూ బండకొయ్యమీద వుండాలన్నారు.

అది సరిపోయింది సరే. ఈ శిక్ష చెప్పేవరకూ రాత్రి పొద్దుపోయింది. అపుడు పటేలు పట్వారీలు తమవూళ్లకు ఎట్లా వెళ్తారు? ఆరాత్రి అక్కడ మకాంవేశారు. మకాంవెయ్యటం అంటే వూరికే వుండా? పటేలుకోసం ఆరాత్రి ఒకవేట తెగాలి. పట్వారీకి గారెలు, పరవాన్నం మొదలైనవి కావాలి.

ఆ కుఱ్ఱవాడియింట్లో జొరబడ్డారు. కావలసినవల్లా తెచ్చారు. మొత్తానికి తెల్లవారింది. బండకొయ్యనుండి వదలిపెట్టబడ్డ ఆ కుఱ్ఱవాడితో 'ఒళ్లుదగ్గరపెట్టుకో. మిన్నూ మన్నూ తెలియకుండా ప్రవర్తించకూ' అన్ని వాళ్ల దారినివాళ్లు వెళ్లారు. ఆ పిల్లవాడికుటుంబం అనుకున్నారు ఆరోజున అయ్యోపాపం! ఇన్నాళ్లొటిమట్టి పులులు ఈమాత్రంపని చెయ్యనేలేదు. అవ్వియేం ఇంటిమీదకువచ్చినయ్యా? గారెలు తిన్నయ్యా? బండ

కొయ్య వేసినయ్యా? పొరపాటున వాటిని చంపమని వీళ్లతో అన్నాం. వీళ్లనిచంపమని వాటికో అన్నా బాగుండేది” అని.

ఈరీతిగా ఈపిల్లవాణ్ణి శిక్షించేందుకు వచ్చిన పటేలు పట్వారీలతో ఊళ్ళోవాళ్ళందరూ చెప్పకోవచ్చుగా. ‘అయ్యా మీరిద్దరూ ఇప్పుడు కలసిఉన్నారు. ఆ పులులవిషయం ఏమిటో ఆలోచించండి’ అని ఒక్కడవ లేదు. ఎందుకన లేదు? అంటే ఏం తప్పో! వాళ్ళు ఆపనిమీద వచ్చారా? యితరపనిమీద వచ్చారాయెను: ఆపనిమీదవచ్చినప్పుడు ఈపని చెప్పటం బాగుంటుందా? వారికి కోపంవస్తుందేమో! వారికి కోపం తెప్పించటం ఏమంత మంచిపని. వాళ్ళింకొకరోజంటారు. ఇంకొకరిని బండకొయ్య వేయిస్తారు. అది ఎవడికో తెలియదాయె. ప్రతివాడు తనకే అనుకుంటాడు. దానిదుంపతెగిరి బండకొయ్యఉంటే ఒక రోజుఉంటాం అనుకుంటారా; అంతటితో సరిపోతుందా? ఎవరికి బండకొయ్యపడుతుందో ఆరోజున వాడికొంప గుల్లఆయెను. ఇంట్లో క్రొత్తకోడలున్నదనిఅయినా చూడరు. ఏకాయకీ ఇంట్లోకి పోతారు. ఎక్కడెక్కడ దాచుకున్నవస్తుపులూ బయటకులాగుతారు. ఈ బాధలుపడలేక ఎవళ్ళదారినివాళ్ళు ఊరకున్నారు. ఏతావాతా జరిగింది ఏమిటంటే పులులనుగురించి పటేలు పట్వారీలు కలసి మాట్లాడటంజరగలేదు. మళ్ళీ నెలలు జరుగుతున్నై. నాటికేం పనా పాటా! తెల్లవారుతుంది; ప్రొద్దుకూకుతుంది; మళ్ళీ తెల్లవారుతుంది; మళ్లీ ప్రొద్దుకూకుతుంది. ఈ పులులుకాని, ఈ పటేలు పట్వారీలు కాని రా

యేమీచేయలేరు; పగటిని యేమీచేయలేరు; పులులు అంత గొప్పవేకదా? పటేలు పట్వారీలు వాటికన్న గొప్పవాళ్ళు కదా! ఈ పగటినీ, రాత్రిని "ఏయ్ ఆగండీ" అని గదమాయించి అటకాయించరాదూ? వెధవమేకపిల్లలమీదకీ, కుఱ్ఱవాళ్ళమీదకీ పోకపోతే!.

వాళ్ళటకాయించరు. పగలూ రాత్రీ యథేచ్ఛంగా వెళ్ళొస్తున్నై, వస్తూన్నై. మరి దానవాయపాలెం దానవాయిపాలెంగానే ఉండాల్సిందేనా యేమిటి? మరి ప్రతిసంసారాయపాలెం కాదన్నమాట?

ఉన్నద్దుండగా ఉయ్యూరుమీద మేడూరు వచ్చిపడ్డదనీ, ఇంకో కథ జరిగింది. ఆ పిల్లవాడికి బండకొయ్యవేసినప్పుడు, ఆ వెయ్యటంకానీ, ఆ వేటను కొయ్యటం ఏయింట్లో పడితే ఆ యింట్లో దొరబడి ఏదిబత్తే అది తీసుకరావటం ఊళ్ళో పెద్దలకు ఇష్టంగా కనిపించలేదు. మరీ మనచరిత్రకారుడున్నాడే అతను కొంచెం నిష్ఠురంగా మాట్లాడాడు. ఎదిరించి మాట్లాడాడు. మరి అతణ్ణి ఎందుకు బాడకొయ్యవేయలేదు? అంటారేమో! ఆ ఊళ్ళో అతను పెద్ద. కొంచెం అనోన్నదకాలు కలవాడు. చదువుకున్నవాడు. అతణ్ణి వైయ్యడం ఎల్లా?

ఈ ఈ కారణాలవల్ల పటేలు పట్వారీలు ఆ ఊరుమీద కారుపట్టారు. ఆ పులుల్ని సంహరించటానికి వీలులేదనుకున్నారు. ఎందుచేతనంటే అది రాజుగారు వేటాడే అడవి.

అక్కడ పులుల్ని చంపటానికి వీలు లేదు. చంపితే అది ఒక పెద్ద తప్పు. అసలు వేటంటే ఎట్లా జరగాలంటే? పటేలు పట్వారీలు రివిన్యూ ఇనస్పెక్టరుకు చెప్పాలి. ఆయన తహసీల్దారుకు వ్రాయాలి. ఆయన డిప్యూటీ కలెక్టరుకు వ్రాయాలి. ఆయన కలెక్టరుకు వ్రాయాలి. ఆయన పైకి వ్రాసి కనుక్కుంటాడు. వీళ్ళందరూ అనుకూలంగా వ్రాస్తే పైనుంచి హుకుములు వస్తాయి "వేటాడవచ్చును" అని. అప్పుడు కలెక్టరుగారు ఒక పాతికమంది సిబ్బందితో ఆ ఊరు వస్తారు. అక్కడ మకాం వేస్తారు. అడవిలో మాట్లు ఎక్కడ పెట్టాలి? మొదలైన విషయాలు తేలేటప్పటికి ఒక వారం రోజులు పట్టుంది. ఈ వారం రోజుల్లో ఆ కలెక్టరుగారియొక్క, సిబ్బందియొక్క గర్భగోళాల్లోకి ఆ ఊళ్ళో ఆస్తి సగం వెళ్ళి జీర్ణంబౌతుంది. ఈ కలెక్టరు గారు మాటుపెట్టిన చెట్టుమీద కూర్చుంటారు. పదిఊళ్ళజనం డప్పులతో బాజాలతో బయల్దేరి పులులను ఆ చెట్టుక్రిందగా తోలాలి. అప్పుడు వారు ఆ పులిని చంపుతారు. కాని, సామాన్యంగా జరిగేది ఏమంటే? ఈ పోగైనజనంలోనే ఎవడో దాన్ని చంపుతాడు. దాన్ని కలెక్టరుగారే చంపారంటారు. ఈ వేటాడినందుకు కలెక్టరుగారికి జీతం ఎక్కువౌతుంది. ఇదీ వేట అంటే. ఇంతమంది తపస్సు చేస్తే చచ్చినపులికి మోక్షం వచ్చినా రాకపోయినా మా కలెక్టరుగారికి మోక్షం వస్తుంది. ఎవళ్ళో తపస్సు చేయటం ఏమిటీ? మరొకరికి మోక్షం రావటం ఏమిటీ? అంటారు. అయ్యో బాబూ! మోక్షం రెండురకాలు_

భగవంతుడిచ్చేదీ. రాజుగారిచ్చేదీ. భగవంతుడిచ్చే మోక్షం ఎవళ్ళు తపస్సుచేస్తే వాళ్ళకిస్తాడు. రాజుగారిచ్చే మోక్షం మరొకళ్ళుచేస్తే ఇంకొకరికిస్తారు. ధర్మం ఉండాలా? భగవంతుడూ తపస్సుచేసినవాళ్ళకే యిచ్చి, రాజుగారూ తపస్సు చేసినవాళ్ళకే యిస్తే ఏంబాగుంటుంది? ఇద్దరూ చెరిఒకళ్ళకీ యిస్తే గొప్పవిషయం జరిగిందన్నమాట. అంతర్జాతీయ విషయంకంటే గొప్పవిషయం అన్నమాట. ఇది అంతర్లోకవిషయం. అంటే అనేకలోకాలమధ్య సామరస్యం.

ఇంత తతంగం జరగాల్సిఉండగా పులివధకీ అడుగులలో నష్టం హింసపాదని పటేలుపట్వారీలే రెవిన్యూ ఇనస్పెక్టరుకు వ్రాయరాయె. ఇంక చెప్పావు. 'పులిసంసారాయపాలె' మట! ఎలాగాతుంది ఏమిటి?

౬

ఇది క్రమంగా ఊరికీ పటేలు పట్వారీలకీ సుతరాం పడకపోవటంగా వృద్ధిపొందింది. వాళ్ళిప్పుడీ ఊరు రావటమే లేదు. ఎప్పుడైనా వస్తారు. వస్తే ఇతరఊళ్ళోవాళ్ళని పదిమందిని వెంటబెట్టుకొనివస్తారు. పులులపన్ను న్యాయసిద్ధంగా చెల్లుబడిపోతున్నా రాజుపన్ను వసూలుకావటం కష్టమైపోతోంది. ఏ సంసారి ఈయవలసినపన్నూ న్యాయంగా వసూలుకావటం లేదు. జప్తులు హంగామా జరగాల్సిందంతా జరిగితేనే

గాని చిల్లిగవ్వయినా వసూలయ్యేట్టులేదు. ఈ ఊరును గురించి పటేలు పట్వారీలు పదిరోజులకొకరిపోర్టు పంపిస్తారు. ఊరంతా రాజుగారి కెదురుతిరిగిందనీ, వాళ్ళందరూ జాతీయ వాదులనీ, సామ్యవాదులనీ ఒకటేమిటి చిలవలుపలవలుగా వ్రాస్తారు. పన్ను వసూలుచెయ్యటానికి వెళ్తే ప్రాణాలతో బయటపడటం కష్టమనీ వ్రాశారు. వాళ్ళువ్రాసేరిపోర్టు నిజంగా పట్టే రక్షకభటులు రావాల్సిందే. ఈపాటికి ఈఊళ్లో సగానికి సగం శ్మశానం కావలసిందే.

ఊరిమీద అదనపుపన్ను పడవలసిందే కాని, మన చరిత్రకారుడు వ్యవహారంముదిరిపోతుందని తెలుసుకొని తానూ క్రియావాది అయినాడు. రెవిన్యూఇన్స్పెక్టరు మొదలు పైవరకూ అర్జీలు వ్రాశాడు. "మాకు ఈఊళ్లో పులులబాధ ఎక్కువగాఉంది. పటేలు పట్వారీలతో చెప్పుకున్నాము. వాళ్లు వినిపించుకోలేదు. పైగా ఎందుకో మాఊరిమీద కారుపట్టి ఉన్నారు. మేము రాజద్రోహులంకాదు. మమ్మల్నిగురించి పటేలుపట్వారీలు వ్రాసే వ్రాతలన్నీ వట్టికల్పితాలు" అని. ఈ అర్జీలు ఎంతమంది అధికారులుంటే అంతమందికీ పంపించారు. అతను వెళ్ళి అందరిదర్శనాలుచేశాడు. వారినజరానాలు వారికి చెల్లించాడు. పై అధికారులందరూ క్రమక్రమంగా అనుకూలులైనారు. కాని అచ్చంగా క్రిందఉన్న ఇద్దరుముగ్గురు అధికారులు అనుకూలురుకాలేదు. ఎందుచేతనంటే ఈ క్రిందిఅధికారులచేతు లెప్పుడూ పచ్చపడుతూండాలి. ఆ పై అధికారుల

దగ్గరకి అన్ని తాలూకాలవాళ్ళూ వస్తారు. అన్ని జిల్లాలవాళ్ళూ వస్తారు. అందుచేత వాళ్ళకి ఎప్పుడూ ఇచ్చినవాళ్లే ఇవ్వాలసి లేదు. కాని ఈ క్రింది ఉద్యోగస్థులకు ఆ చుట్టుపట్ల పదిఊళ్ళ వాళ్ళూ ఇస్తేనే ఇవ్వటం; లేకపోతే లేదు. అందుచేత వీళ్లు ఎప్పుడూ ఇస్తూండేందుకు దానవాయపాలెంఆయుర్దాయం ఎంత? అప్పటికీ నాలుగైదుతభరీకుజాబితాలు తిరిగినై. ఊళ్లో సగానికి సగంమంది డబ్బివ్వలేదు. ఒక మేకపిల్లని కడ్తారు. ఆవుదూడని తీసుకెళ్ళమంటారు. నాలుగు శేర్లుమినుములు కొలుస్తారు. ఇవన్నీ బస్తీకి పంపించి అమ్మి డబ్బు చెయ్యాలి. ఎందుకంటే ఒక పెద్ద ఉద్యోగస్థుడిదగ్గరకు వెళ్ళి నీకీ మేకపిల్లను ఇస్తాం, నీకు రెండు శేర్లనువ్వులిస్తాం. మాకీ పని చేసిపెట్టమంటే బాగుంటుందా? వాళ్ళెట్లాంటివాళ్లు? లక్ష్మీప్రసన్నం అయితేనేగాని మనవంక చూడరు.

ఈ తభరీకులతో ఆ ఊరిటంగు తెగిపోతోంది. ఇందులో కొంతడబ్బు—కొంతడబ్బేమిటి? సగానికిసగం మన చరిత్రకారు ఉకి రానూపోనూ ఖర్చులక్రింద అయిపోతోంది. మిగిలినడబ్బు నలుగురికీ పంచాలంటే ఏమీసరిపోవటంలేదు. ఆ ఉద్యోగస్థులకి చూపే ఆనటంలేదు.

అయినప్పటికీ ఆ పై ఉద్యోగులు శాంతించారు. అట్టడుగునఉన్న ఉద్యోగస్థులతోనే బాధగాఉంది. వాళ్లు మాటి మాటికీ ఊరిమీదకువచ్చి అల్లరిచేస్తారు. అల్లరిచేస్తారేకాని

జప్తులూ, నెంబుతప్పాలాలు బయటవేయటం, బండకొయ్యాలు వేయించటం ఇల్లాంటివేమీ చేయించటంలేదు. అందుచేత ఊరివాళ్లూ ఆలోచించారు—పూర్వం వీళ్ళజులుం పట్టపగ్గాలు లేకుండా ఉండేది; ఇప్పు డెందుచేత ఇల్లాఉంటోంది అని.

ఒకసారి మనచరిత్రకారుడు జిల్లాకలెక్టరుఆఫీసుకు వెళ్ళి కనుక్కొన్నాడు. పైనుంచి ఏమీ సూకుంలు జారీచెయ్యబడ లేదు. పఠేలుపట్వారీల చెప్పుడుమాటలు విని ఈ క్రింది ఉద్యోగస్థులు ఇల్లా చేస్తున్నారని తెలిసింది. మనవాడు అసలుగుమాస్తాని పట్టుకొని వాడిచేతికి బాగా తడితగిలించి ఈపని నువ్వు చేసిపెట్టకతప్పదన్నాడు. ఆగుమాస్తా ఆక్రిందిఉద్యోగస్థులమీద బరబరా పదిపంక్తులువ్రాసి కలెక్టరుగారిముందు పెట్టాడు. ఆయన ఏముందీ, అసలుకలెక్టరు ఆ గుమాస్తాయేగా! వాడేం వ్రాస్తే దానిమీద దస్కతుపెట్టడమే ఈయనపని. ఈకాగితం క్రిందకి వెళ్ళింది.

దాంతో ఇంకేముందీ, ఇదివరకు పఠేలుపట్వారీలే ఆఊరిమీద కసిపట్టింది. ఇప్పుడు రెవిన్యూఇనస్పెక్టరూ తహసీలుదారుకూడాను. కాని ఏంచెయ్యటానికి వీలులేకుండా వచ్చింది.

ఆ పరిస్థితి అంతా చూస్తే "నిద్రపోతూఉన్న అగ్నిపర్వతం" అంటారే అల్లా ఉంది. ఎప్పుడు ఫెటేలుమంటుందో తెలియదు. ఆ ఊరివాళ్ళు ఒక్క తెలివిగలపనిచేశారు. జమా

బందీనాటిక ఊళ్లో పన్నంతా వసూలుచేసి తాలూకాలో కట్టి వచ్చారు. దానితో తహసీల్దారు, రెవిన్యూఇనస్పెక్టర్లు, పటేలు పట్వారీలు ఏంచెయ్యటానికీ వీలేకపోయింది. డబ్బు వసూలు కట్టుకునేందుకు ప్రొద్దుగ్రుంకేదాక నిలబెట్టి, ఏడిపించినా కట్టు కోక తప్పిందికాదు.

చరిత్రకారుడు మరోకమార్గం అవలంబించాడు. తాసిల్దారుతో రెవిన్యూఇనస్పెక్టరుతో మొరపెట్టుకున్నాడు. "మిమ్మల్ని నేనేంచేశాను చెప్పండీ? మీరు పటేలు పట్వారీల పక్షం ఉంటున్నారు. వాళ్లుచెప్పింది నమ్ముతున్నారు. మేం చేసినతప్పేమీ లేదు. మీరు దయచేయకపోతే మే మేం చెయ్యాలి? నుంచి కాగితంతెప్పించామని మీకు కోపంగా ఉంది. మీరు చీటికిమాటికీ వచ్చి మమ్మల్ని సతాయిస్తూ ఉంటే మే మా పని చెయ్యవలసివచ్చింది. చేసినందుకు క్షమించండీ" అని యెన్నో చెప్పుకున్నాడు. కాని మాటలతో పని జరుగుతుందా? ఆ కారు కారు అల్లాగే ఉంటూనచ్చింది.

ఈ తగాదాలతో పాపం దానవాయపాలెంవాళ్లకి పులులనుగురించి విచారించటానికే వీల్లేకుండాపోతోంది. మనుష్యులూ మనుష్యులూ పోట్లాడుకుంటున్నారుగదా మనకేమని పులులు యథేచ్ఛంగా విహరిస్తున్నవి.

సామాన్యంగా అడవుల్లో రైలుకూతవినిపించేఅంత మారం పులులుండవు. ఆఊరికి ఉత్తరపువైపుగా యాభై మైళ్లలో

ఒకరైలు వెళ్ళుతూంటుంది. ఒక యాభై మైళ్ళు అడవిలో ఊరికే రైలు వెళ్ళుతూఉంటుంది గాని, ఈ యాభై మైళ్ళల్లో ఎక్కడా ఒక్క స్టేషనన్నా లేదు. ఈరైళ్ళల్లోమనుష్యులు వెళ్ళుతూఉంటా రని ఎట్లా కనుక్కున్నయ్యో ఆ పులులు కనుక్కున్నై.

మనుష్యులకోసం అంతదూరం ఎందుకు వెళ్లాలి? దాస వాయిపాలెం ఉంది కదా. అంటారేమో! ఈ చరిత్రకారుడు బలే అసాధ్యుడు. మేకల్నీ పశువుల్నీ. వేసుకపోతే వేసుక పోయినై గాని, పులులు మనుష్యుల్ని వేసుకపోగూడదన్నాడు.

ఈ పటేలు పట్వారీలతో విరోధం ఆఊరికి ఒకవిధంగా మంచి మేలుచేసింది. అదివరకు వాళ్లందరూ జానపదులు, గ్రామీణులు. అటువంటివాళ్లిప్పు డందరూ ఒక కట్టుగాఉండ టం ప్రారంభించారు. అందరూ ఒకత్రాటిమీద నడుస్తు న్నారు.

అందుచేత ఎవడిగొడ్లనివాడు అడివిలోకి ఒక్కడూ తోలుకెళ్లకూడదు. నాలుగుఇళ్లవాళ్లు నలుగురు కలిసి నలు గురిగొడ్లనీ కలిపి తోలుకెళ్లాలి. ఈ నలుగురూ ఎప్పుడూ ఒక ళ్లనువదలిపెట్టి ఒకళ్లుండగూడదు. గొడ్డు చెదరిపోతే వెతకటా నికి నలుగురూ వెళ్లాల్సిందేతప్ప ఒక్కడూ వెళ్లకూడదు.

సామాన్యంగా పులులు ఏ రాతినో ఏ చెట్లగుంపునో చాటుచేసికొని కాపువేసిఉంటవి. అందుచేత వీళ్లు బంగరు బయలుగా ఉన్న ప్రదేశంలో పోనలసిందేగాని గుట్టలప్రక్కగా

పోకూడదు. అడవిలో త్రోవలు మలుపులు తిరుగుతై. ఆ మలుపుల్లో కాస్తుంది పులి. కనుక దూరమైనాసరే ఆ మలుపును తప్పించుకుపోవాలి.

పులి అక్కడ వుందో లేదో తెలుసుకునేందుకు గుర్తులున్నై. పులిఉంటే పిట్టకూస్తుంది. కోతులు కిచకిచలాడుతై. వాసనగాలి పారినంతమేర లేళ్లు మొదలైనజంతువులు ఆ మార్గాన్ని పరిహరిస్తయి. ఎలుగుబంటి ముక్కుఎత్తుకుని సీదరించుకొని తొలగిపోయిందంటే ఆ గాలిత్రోవకి ఎగువభాగాన మాంసం ఉన్నదన్నమాట.

ఇల్లాంటి గుర్తులన్నీ ఊళ్లో పసిబిడ్డబాలాదికీ నేర్పారు. జాగ్రత్తగా ఉండమన్నారు.

మనిషినిచంపటం అలవాటులేని పులి అయితే కేకలు వేస్తే, హంగామాచేస్తే, బెదరిస్తే తొలగిపోతుంది. మనిషిని చంపటం అలవాటుపడ్డపులి బెదరించినకొద్దీ గాండ్రుమని ముందడుగు వేస్తుంది.

గ్రుడ్డిలోమెల్ల ఏమిటంటే, ఉన్న తొమ్మిదిపులులూ మనుష్యులను వేటాడవు. అందులో హేమాహేమీలు ముగ్గు

ఈ కట్టుదిట్టాలవల్ల పులులకు మనుష్యులమాంసం అలభ్యమైంది. రాత్రిపూట ఊరిమీదకు వద్దామంటే ఊరుచుట్టూ గసెలు పాతి కంచెలువేశారు. ఊళ్లోకి వెళ్లేందుకు రెండే

త్రోవలు. రెంటికీ పెద్ద పెద్ద పెండెములు పెట్టి ప్రొద్దుగుంకటం తోటే బిగిస్తారు. సూర్యాస్తమయం అయ్యేలోపుగానే ప్రతి ప్రాణీ ఊళ్లోకి చేరాల్సిందే.

ఇందుచేత పులులకేమీ కోరుకున్నది దొరకటంలేదు. అప్పటికే ఒకటి రెండు ప్రయత్నాలు చేసినై. కాని ఫలించలేదు. పైగా ఊళ్లో బరిసెలు బయల్దేరినై. సరిగ్గా యుద్ధం క్రిందకు తేలింది. నలుగురు కలిసి ఉంటారు. ఒకణ్ణి పట్టుకుంటే తక్కినముగ్గురూ పారిపోరు. బరిసెలతో పొడుస్తున్నారు. ఇట్లా ఒకటి రెండు జరిగినై. అందుచేత రైలుని వెతకవలసివచ్చింది.

౨

రైలురోడ్డు ఆ ఊరికి యెభై మైళ్ల దూరం ఉందని చెప్పాం కదా! అడవుల్లో మనుష్యులకే దూరమంటే లెక్కలేదు. ఏభై మైళ్ళు ఒక్క పూటల్లో నడచివస్తారు. తెల్లవారగట్ల ఏ మూడుగంటలకో బయల్దేరివస్తారు? పనిచూచుకొని మధ్యాహ్నం ప్రొద్దుతిరిగేవేళకి యింటికొస్తారు. అంటే నిక్కచ్చిగా పన్నెండుగంటలు నడచినవాళ్ళు నడిచినట్లే ఉంటారు. ఆ వూరు ఎంతదూరం ఉందా? అంటే "ఆ! రెండుపరుగుల దూరం" అంటారు. అంటే అవ్యవహితంగా నడిచేవాళ్లకు పన్నెండు గంటలు. వాళ్ల కదొకపూట లెక్క. ఇంక మనకా రెండు మూడు రోజుల ప్రయాణం. అడవుల్లో ఉండే మనుష్యులంటే వాళ్ళు. ఇంక పులులవిషయం చెప్పాలా? పులినిగురించి సామాన్యంగా

చెప్పుకుంటుంటాయి. రాత్రి యే యెనిమిదింటికో బయల్దేరి తెల్లవారేసరికి చక్కగా పన్నెండువందలమైళ్ళు తిరుగుతుందని. అటువంటిపులులకు యాభై మైళ్ళ దూరంలోఉన్న రైలు ఒక లెక్కా! ఇన్నాళ్ళూ అది ఒక భయంవేసి ఆరైలుమోతఅంటే యేమిటో అనుకొని ఆవైపు తొంగిచూడలేదు. కాని ఇప్పుడా భయమంతా వదలింది. ఎందుకు వదిలిందయ్యా అంటే! వాటికి తెలిసిపోయింది. ఒస్, ఈ రైలు మనుష్యులే వేశారట! అని. మనుష్యులంటేనే అంత లోకువైపోయింది. వాళ్ళవంక మనం చూడనంతసేపేకాని, చూస్తే వాళ్ళ బండారం బయటపడ్డది. వెళ్ళు ఎంతసేపటికీ ఉపన్యాసాలబండారమేకదోయ్. ఒక్కడు కత్తిపుచ్చుకొని మనమీదికి రాలేదు. కాదని మనం గాండ్రించి చూస్తే ఇరవైమందిని ఒక్కసారి నవిలేయవచ్చు. ఈసంగతి వాటికి తెలిసింది. తెలిసిందేపాటుగా ఆ మనిషిమీదనేకాదు ఆ మనిషి చేసినపనులమీదకూడా నిరాదరణ పుట్టింది.

అసలింతకూ ఆ రైలుమీద దాడిచెయ్యాలని పులులేమీ సభలుచేసి అనుకోలేదు. అసలా సభలంటే వాటికి అసహ్యమంట. వాటిసిద్ధాంతం ఎంతసేపటికీ నములినవాడికన్న మ్రింగినవాడు దొడ్డవాడని. ముందర దెబ్బతియ్యి, తర్వాత చూస్తాం. ముందరకొట్టినవాడిది పైచెయ్యి. తర్వాత వాళ్లూ పెద్దా వస్తారు. సర్దివేస్తారు. అట్టే మాట్లాడితే నీదికూడా తప్పనంటారు. నీమీదికి అనవసరంగా ఎందుకువస్తారు! నీవల్లా ఏదో లోపం ఉండాలంటారు. ఆలించేవాడా? పాలించేవాడా?

ఆసమయానికి నీ అదృష్టం చాలకపోతే అక్కడచేరేవసదిమంది మనుష్యులూ ప్రత్యక్షమై ఉంటారు. లేకపోతే ఆ కొట్టినవాడిపక్షం వాళ్లయి ఉంటారు. తొట్టిపహా డట్లా ఉండగా నిన్నుపట్టుకుని చెరకు త్రోస్తారు. దెబ్బతిన్నవాడవు నువ్వు. మంట అనుభవించేది నువ్వు; కేకలువేసేది నువ్వు. తరువాత వచ్చి చూచిన వాళ్లందరికీ తప్పు నీదిగా కన్పిస్తుంది. ఇదీ లోకం.

పులులతరహా ఇదీ. వాటికి మనుష్యులు లోకువైనా రంటే అవ్వేమీ ఆలోచించవు. యాదృచ్ఛికంగా అట్లా జరగాలి. అట్లా జరిగింది. ఒకసారి ఏమైందంటే పెద్దవర్షాలు కురిసినై. ఆ యెగువన ఒక యేరు పొంగి వరదలై వచ్చి రైలుకట్టను గండిపడిపోయింది. వారంరోజులు రైళ్లు నడవలా. అందుచేత మ్రోత వినిపించలా. వినిపించనంతమేరా పులులు స్వేచ్ఛగా. ఈ చివరి నాలుగైదురోజుల్లో అవి వెళ్లటం, ఆ రైలుపట్టాల మీద పడుకోటం సాగించినవి.

తీరా చివరికి పదిరోజులతర్వాత రైలు వచ్చింది. తత్పూర్వం పైలట్ ఇంజను వచ్చింది. పైలట్ ఇంజనువచ్చినవేళ పులులు అక్కడ లేవు. దారిఅంతా బాగాఉన్నదనుకున్న తర్వాత ఆరోజున పగలు రైలు బయల్దేరివస్తోంది. రాత్రిళ్లయినా బాగుండేదేమో! ముందరదీపాల వెల్తురునాలుగైదు ఫర్లాంగులు ఉంటుంది. అవి భయపడి పారిపోయేవేమో! రైలు పగలు వస్తోంది. ఆ రావటంలోకూడా మహా నెమ్మదిగా వస్తోంది.

అందులో ఇంజనుముందర ఇద్దరుముగ్గురు మనుష్యులు పెద్దెంమీద కూర్చున్నారు. రైల్లోంచి జనం తొంగిచూస్తున్నారు. గాబరా, భయం, ముఖాలు కనిపిస్తున్నై. మనుష్యులను చూడటంతోటే మనపులులకు ఇంజను అనీ, పొగ అనీ, మోత అనీ, ఆవిరి అనీ, ఇవి యేమీ అనిపించలేదు. డ్రైవరు ఇంజను ఆపేశాడు. బుస్సుమని పొగవదిలిపెట్టాడు. ఈలవేస్తాడు. గుప్పుగుప్పుమనిపిస్తాడు. రైలులో జనం అందరూ గాబరాపడిపోతున్నారు. డ్రైవరన్నాడుకదా: కాదు రైలు పరుగెత్తనీ, అవ్వే రైలుక్రిందపడి చస్తవి అన్నాడు. నాలుగుమృగాలమీద రైలు వెళ్తూంటే ఒకవేళ రైలుకూడ బోల్తాపడవచ్చు. అవి రైలుప్రక్కల నిలుచుండి రైలుకిటికీల్లోంచి మనుష్యులమీద దూకవచ్చు. అసలంతదాకా ఎందుకు? రోజు కైదారురైళ్లు నడుస్తుంటేనే దిక్కుదిబాసు లేదు. పదిరోజులకీ రైలు వచ్చిందనేప్పటికి రైలుపెట్టెలన్నిండా జనం కిటకిటలాడిపోతున్నారు. రైలులో కెక్కే ద్వారబంధాల్లో నిలుచున్నారు. బయట ఇనుపకమ్ములుపట్టుకుని కాళ్ళుంచేబల్లలమీద నిలుచున్నారు. రైలుపెట్టెలపైకప్పుమీద కూర్చున్నారు. సగానికిసగం వీళ్లల్లో టిక్కెట్టుకొన్నవాళ్ళు కారు ఈ జనం. జనమందరికీ పులులను చూచేవరకు ప్రాణాలు బాగున్నై. ఏడ్చేవాళ్ళు, మొత్తుకునేవాళ్ళు, బల్లలక్రింద దూరేవాళ్ళు— నానాగందరగోళమూ అయింది.

ఇట్లా ఉండగా ఆ డ్రైవరు ఒక పిరికివాడు. వాడు చూచి చూచి ఇంజనే వదలిపెట్టి పారిపోయినాడు. ఇంక రైలు నడిచే దెట్లా? రైలులో ఉన్నవా ళ్ళేంకావాలి? పెట్టెలలో అయినా ఉన్నవాళ్ళు కాదు. వాళ్ళని బయటవాళ్ళు ఉండనిస్తేగా? బయటవాళ్ళు బలశాలులు. వాళ్ళు చొచ్చుకొని లోపలికి పోయినారు. లోపలఉన్న పసిపిల్లలతల్లులు, బలహీనులు బయటికి నెట్టబడ్డారు. అడవిలో పరుగెత్తేవాళ్ళు, ఏడ్చేవాళ్ళు. తా మేంచేస్తున్నారో తమకే తెలియనివాళ్ళు పిల్లందరినీ చూస్తే పులుల కేమనిపించిందో తెలియదు. ఇదివర కెప్పుడన్నా చాటుగాపోయి యే పొదచాటునో, ఏ బండరాతిచాటునో నక్కిఉండి అల్లా మనిషిని రానిచ్చి అగావుగా వేసుకపోవటమే తెలుసు. కాని. వాటికి ఇల్లా జనంమీద పడి వీరవిహారం చెయ్యటం తెలియదు. వీరవిహారం చెయ్యవచ్చుననీ తెలియదు. ఆ పులులు తెల్లబోయి చూస్తున్నవి. ఇంతలో ఒక పిల్లతల్లి తా నేంచేస్తూందో తెలియక ఆ యేడుపులో ఈ పులులవైపునకే వచ్చింది. అందులో ఒక చిన్నపులి సరదాగా పోయి ఆబిడ్డను పట్టుకుంది. అంతే, ఇంకా యేం. తెలిసిపోయింది. మొదట కొంచెం భయంభయంగా, తర్వాత యథేచ్ఛంగా, చిత్రచిత్రంగా వీరవిహారంచేసినవి. కొందరికాళ్ళు కొరకినవి, కొందరిని చంపినవి. కొందరిని ఖండించినవి. కొందరిశిరస్సులు, ముక్కులు, చెవులు, నోరు ఇవని తెలియకుండా చిత్రవధచేసినవి. అన్నీ కలిపితే తొమ్మిది

పులులు. తొమ్మిది తొమ్మండుగురిని యెత్తుకుపోయినా ఫర్వా
లేదు. వచ్చినవాళ్ళేమి, గాయాలుతిన్నవాళ్ళేమి, తొంభై
నుంచి నేలాగ.

ఆ పులులకు సరే. అవి క్రూరమృగాలు. గనుక అంతే
మానవుని చంపినవి. అవి మనుష్యులను తింటవి గనుక తొమ్మం
మందిని ఎత్తుకొనిపోయినవి. నగలు, గుడ్డలు ఎత్తుకొనిపోయి
నవి గదాను. పిల్లలు ఆడుకొనేందుకు కాబోలును! చక్క
నికి కాదుగా, పిల్లలంగా మాడమూ! తెలిసి బక్క ఊర
పక్కలు చేసి ఒక ప్రాతపేటికను పట్టుకొని అది అటూ, ఇది
ఇటూ లాగుతూ గురగుర పెట్టుతూ కనిపిస్తవి. అది వాటికి
ఆట కాబోలు. అట్లా పిల్లలాడుకోవాలని ఈ పులులు బట్టలు,
డబ్బునూడ ఎత్తుకొనిపోయినవి.

పులులు తొమ్మిదేకదా, పేటికి పిల్లలెక్కడా అంటా
రేమో మీరు? అందులో నాలుగుసంసారా లున్నవి. తల్లిపులి
తల్లిపులికాగా ఇద్దరుకూతుళ్ళు, ఇద్దరల్లుళ్ళు. ఇద్దరుకొడుకులూ,
ఇద్దరుకోడళ్ళు; ఆ పెద్దపులికి దౌహిత్రులూ, పౌత్రులూకూడా
కలిగారు (కలగటంలో జంటలుజంటలుగా కలిగారు) ఎల్లా
గైతేనేమి! నలుగురుతల్లులకీ కలిపి పదకొండుగురు పిల్ల
లున్నారు. వంశం మంచి అభివృద్ధిలోనున్నది.

అచ్చంగా అంతా లాభంకాదు. అందులో ఒక పులి
పిల్ల దొంతంబకటి రత్నహారాన్ని కొరుకుతూంటే - మాంసంఅను
కుందేమో-ఊడిపోయింది. తొమ్మిదిపులులూ ఆ - పిల్లచుట్టూ



చేరి చాలా విచారించినవి. ఆ పులిపిల్ల 'కంగరు – కంయి' మంటూ నాలుగునైపులా పదిబారలుపోవటం రావటం.

ఈరీతిగా పులులకు రైళ్ళుదోచుకోటం మొదటిసారి అలవాటైంది. ఇంక అక్కడనుంచి కొట్టినపిండిఅయింది. ఆపాటికే నాలుగైదుసార్లు పులులు రైళ్ళమీదపడ్డవి. మరి రైలుఅధికారులు ఊరకున్నారా? రాచరికంవారు నిద్రపోతున్నారా? అని అంటారేమో? మొదటిసారి పులులుకొట్టడంతోటే పూర్వం వరదలకోసం ఆపారు రైలు. ఇప్పుడు పులులకోసం ఆపారు. తంతివార్తలు వెళ్లినవి. (గొట్టాలవార్తలు వెళ్లినవి) తర్వాత నాల్గవరోజున పదిమందిసైనికులు తుపాకులు రైలువెంట వచ్చారు. ఆరోజున పులులు కనిపించలేదు. అట్లా నాలుగు రోజులు సేన వచ్చింది. ఆ! అదెందుకో ఆరోజున అట్లా జరిగింది కానీ, ఎప్పుడూ అట్లా జరుగుతుందా? అనుకున్నారు. సైనికులు తుపాకులు రావటం మానివేశారు. ఈ పెద్దపులులకు వీళ్లు వస్తున్నారని తెలిసేందుకు గూఢచారులున్నారా? పసిపిల్లడిదంతబాధలోపడిఉన్నారా? లేకపోతే దైవికంగా ఆ వారం రోజులు వెళ్లలేదా? తరువాత పులులు వెళ్లినవి. కనీసం మూడుసార్లైనా తర్వాత రైలుని యథాయథంచేసినవి. పత్రికలనిండా ఇదే వార్తలు.



అటూ యిటూ ఆరు నెలలు గడచింది. ఈ ఆరు నెలల్లో చిన్న పులులుకూడ పెద్దవైనై. మనుష్యులు పెద్దవాళ్ళుఅవ్వాలంటేను కొన్ని యేళ్ళు పట్టుతుంది. ఆ మనుష్యుల్లోకూడా అనేక భేదాలు. చదువు సంధ్యా మొదలైనవి కులవృత్తిగా ఉండే వాళ్ళు. వాళ్ళ చదువులూ సంధ్యలూ పూర్తియైనతర్వాతగాని పెద్దవాళ్ళుకారు. అప్పటికి ఏ పాతికయేండ్లో వస్తవి. వాడికి చదువూ సంధ్యా లేకపోతే వెనక నాలుగుయెకరాలు కొండ్రయినా లేకపోతే వాడెప్పుడూ పెద్దవాడే కాడు. ఇతరవృత్తుల వాళ్లల్లో పదునాల్గు, పదిహేనుఏండ్లు వచ్చేటప్పటికి ఆజాను బాహువులై రొమ్ములిరిచి కొండ్రదున్నుతూ ఉంటారు. మొహంలోకి అదేదో ఒక విలక్షణమైనచూపు పట్టుతుంది. సంవత్సరంక్రిందటివరకు గొడ్లనికాస్తూ అర్ధనగ్నాకారల్తే తిరుగుతూనేఉంటాడు. ఏడాది రెండేళ్ళు తిరిగేటప్పటికి అదేదో మిసమిసలాడుతూ అల్లా పైకి తేలివస్తాడు. ఈలోపుగా పెండ్లి ఔతుందో యేమో ఎప్పుడు బలుద్దామా? అని అత్తవారింటికోసం యెదురుచూస్తూ ఉంటాడు కాబోలు!

ఒక యేడాదిలో అక్కల్లు వాడికి "శానిటోరియం" వలె పనిచేస్తుంది.

ఇంకా మరికొన్ని వృత్తులున్నై. వాటిల్లో – చిన్నా పెద్దా అంతా ఒకటే. వాళ్ళల్లో ప్రతివాడూ పెద్దవాడే. ఇంక

ఆవుదూడలూ ఆ స్త్రీ ఉన్నై. ఆరు నెలలు తిరిగేటప్పటికి గిత్త. ఏడాది తిరిగేటప్పటికి ఎద్దు. న్యాయమే కదా! ఎనభై యేళ్లు పూర్ణాయుర్దాయమైనవాడికి పద్ధెనిమిదేండ్లకు యౌవనం వస్తుంది. పదేండ్ల పూర్ణాయుర్దాయమైతే ఏడాదిలో వయస్సు రావద్దూ? అందులో క్రూరమృగాలు గనుక ఆరు నెలలకే పెద్దవైనై. లేకపోతే ఎవరు సంపాదించిపెడ్తారేమి? వాటి అంతట అవి వేటాడుకోవాలి; తినాలి.

అందుచేత భగవంతుడుకూడా వాటికి పెందరాడ వయస్సు తెప్పిస్తాడనుకుంటా. ఎంతవయస్సు వచ్చినా మరో యేడాదివరకూ తల్లిమృగాన్ని అంటిపెట్టుకొనే ఉంటవి—మరీ కుందేళ్ళకోసం, లేడిపిల్లలకోసం తల్లిమీద ఆధారపడకుండా.

ఈరీతిగా పులిసంసారం వెరస్తే యిరవై అయింది. ఈ యిరవై యిరవై ఒకచోటే ఉంటే చాలా కచాటుగా ఉంది. స్థలం చాలటం లేదు. తిండీ అంత రావటం లేదు. అన్నీ కలిసి ఒకజంతువును వేటాడితే అన్నింటికి తలాఒక ముద్దకూడా రావటం లేదు. ఈమధ్య అవి కడుపునిండా భోజనం చేసే—చాలా రోజులైంది. అప్పుడప్పుడు రైళ్లమీదపడి ఖంగాళీ చేసినప్పుడు తప్ప తక్కినప్పుడు వాటి డొక్కలు ఏడుస్తూనే ఉన్నవి. సరే యిల్లా కాదనుకొని పదీ పదివైపులకు వెళ్ళినవి. రెండుపిల్లలు, ఒక పెద్దది. మూడుపిల్లలు, ఒకపెద్దది. ఇల్లా విడిపడిపోయి వేరే వేరే స్థావరాలు ఏర్పరచుకొన్నవి. ఒక్కొక్క స్థావరానికి మధ్య కనీసం యేభై అరవై మైళ్లయినా ఉండాలి కదా! అందుచేత

మరాం నాలుగు నెలలపాటు ఆ ప్రాంతాల్లో ఈ పులివిహారం సాగింది. జనని జనని అంతా అభద్రమైపోయింది. ఇదివర కొక్క దాన వాయుపాలెంవాళ్లే మనగతి ఏమికావాలిరా! అనుకుంటూండే వాళ్ళు. ఇప్పుడే నాల్గువందలచదరపుమైళ్ళమేరా వున్నవాళ్ళు ప్రాణాలు గుప్పిట్లోపెట్టుక తిరుగుతున్నారు. ఎప్పుడు వచ్చి ఎత్తుకెళ్తాదో, ఎప్పుడు స్త్రీలను చంపుతాదో, ఎప్పుడు పసి పిల్లల్ని కిటికీపక్కన కొరికేస్తదో, ఎప్పుడే ఊరిమీద పడుతదో, ఎప్పుడే కేకలు వేసి గగ్గోలుపెడతదో! ఇది బ్రహ్మకుకూడ తెలియని విషయం.

కానీ అన్ని ఊళ్ళవాళ్ళు దానవాయుపాలెంవాళ్లనుచూచి నేర్చుకున్నారు. అన్నిగ్రామాలచుట్టూ బరిసెలు పాతారు. ఒక్క బరిసెలేమిటి! దానవాయుపాలెంవాళ్లు పులులనుండి తమర్ని రక్షించుకునేందుకు ఎన్ని కాపుదలలుచేసుకొన్నారోఅన్నీ వాళ్లు చేసుకొన్నారు. అందుచేత పులులకు కాలూ చెయ్యీ ఆడడంలేదు. ఈ పరిస్థితులలో అన్నీ కలిసి దాడిచేస్తేనే బాగుంటాదనిపించింది. అందుచేత అప్పుడప్పుడేమిచేస్తున్న వంటే రెండుమూడుమృగాలు కలిసి ఒకఊరిమీదకు పోవటం.

ఈ ఊళ్ళవాళ్లు మరొకటి నేర్చుకున్నారు. పూర్వం వాళ్లదగ్గర బరిసెలు, కఱ్ఱలూ, కత్తులుమాత్రమే. ఇప్పుడా ఊళ్లవాళ్ళు తుపాకులు సంపాదించారు. తుపాకీమోత వింటే మాత్రం పులికి హడలు. ఇక తుపాకీధ్వని వినిపించిందనుకో. పారిపోవటం మొదలుపెట్టినదా అడవిఅంతు కనుక్కోవలసిందే.

తెల్లవాళ్ళందరూ కన్నుపెట్టేవాళ్ళుగా ఉన్నారు. పులులు ఊళ్ళమీద పడితే ప్రాణాలు సిద్ధపెడతారు. ఇంకొక పెద్ద యుద్ధమన్నమాట. మనుష్యులందరూ ఇళ్ళల్లో దాక్కుంటారు. తలుపులు మూస్తారు. తలుపులకు గడమాకులు, బిగిగట్లూ అడ్డాలుపెడతారు. కోటలనుంచి రాళ్ళవర్షం మొదలౌతుందని వేస్తున్నారు. ఇవికాక ప్రతిఊరికీ ఒక యుద్ధగృహం ఏర్పాటు చేశారు. ఊళ్ళోఉన్నయువకులలో పదిమంది "పులులు వచ్చినవి" అనటంతోనే ఆ యింట్లో చేరతారు. ఆ యిళ్ళల్లో గోడల్లో కంతలుపెట్టారు. ఆ కంతల్లోంచి తుపాకులుప్రేలుస్తారు. ఈ మహాయుద్ధంలో ఒకటిరెండు చిన్నపులులుకూడా చచ్చిపోయినవి.

కాని పులులబలం ఏమీ చావలేదు. ఏందుచేతనంటే ఈ ఉన్నఅడవి ఒక వెయ్యిచదరపుమైళ్ళుగలది. దీనికి పశ్చిమాన రెండుమూడువేలమైళ్ళల్లో మరొక పెద్ద అడవి ఉంది. అది యాభై అరవై వేల చదరపుమైళ్ళ వైశాల్యంకలదీ అంటారు. అది మహారణ్యం. అందులో పులులూ, సింహాలూ, ఏనుగులూ, ఎలుగుబంట్లూ, తోడేళ్లూ, కొరనాసిగండ్లూ, సివంగులూ, చిరుతపులులూ,—ఓ, మహారణ్యం. ఆ మహారణ్యానికి ఈ అడవికీ మధ్య సూటిగా దారిలేదు. కాని, ఈ రెండు అరణ్యాలకీ చాలా పైకి పోవాలి. కలిపేకొండ ఉంది. ఆ కొండ మీదుగా ఆ మహారణ్యానికి రాకపోకలూ, లావాదేవీలూ ఉన్నవి. ఒకప్పుడు ఇక్కడెన్ని క్రూరజంతువులున్నాయో అన్ని

క్రూరజంతువులుగా అక్కడనుంచి సరఫరాఅయినవే. ఈ పులి విహారానికి అంతూపంతూ కనిపించ లేదు.

ఇది పూర్వానికిమల్లే దానవాయుపాలెంసమస్యకాదు. దేశంసమస్య ఐంది. రాచరికంవారిసమస్య ఐంది. ఇప్పుడు రాజుగారు అడవిచుట్టుపక్క కొన్నిస్థలాలు ఏర్పరచి అక్కడ సైన్యాల్ని పెట్టారు. ఈ సైన్యాలు లోపలికివెళ్లి పులుల్ని చంపేందుకు కాదు. అడవిఅంచులనుఉండే గ్రామాలమీదికి పులులువస్తే వాటిని సంహరించమని రాజుగారిఆజ్ఞ. ఏమి టీ వెఱ్ఱి ఆజ్ఞ! "మేము ఫలానాచోటికి వస్తున్నాం" అని చెప్పివస్తాయా పులులు? సైన్యా లెక్కడున్నవో వాటికి తెలుసు. అందుచేత సైన్యాలు లేనిఊళ్లు చూచి వాటిమీద పడతవి. అక్కడ మనుష్యుల్ని చెల్లాచెదురుచేస్తవి. గొడ్లను యెత్తుకపోతవి; స్త్రీలనూ పిల్లలనూ అపహరిస్తవి. ఆ ఊరివాళ్లు సైన్యాలున్న చోటికి కబురు పంపిస్తారు. ఈ జరిగినచోటికి సైనికులు వస్తారు. వాళ్లువచ్చే టప్పటికి పులు లేవీ? రాజాజ్ఞమాత్రం మహాభద్రంగా సాగుతోంది. ఎప్పుడో ఒకప్పుడు పులులకూ సైనికులకు ములాకాత్ కాకపోవడం లేదనుకోండి. ఉన్నప్పుడు పులు లేం తెలివితక్కువవా? గప్‌చిప్‌గా పారిపోతవి.

అసలు అడవిఅంచులలో ఈ సైన్యాలుపెట్టటం ఏమిటీ? అంటాను. పెట్టటం ఎందుకూ? అంటాను. ఇందులో రహస్యం ఏమిటీ? అంటే ఇంట్లో ఒక కుఱ్ఱవాడున్నాడను. వాడికి క్షయ

వ్యాధిపుట్టేచిహ్నాలు కనిపించినవి; దానికి చికిత్స చేయించలేదు. గొప్ప ఆయుర్వేదవైద్యుడిదగ్గరికి వెళ్లలేదు. ఇంగ్లీషువైద్యుడి దగ్గరకి వెళ్లారు. వాడిశాస్త్రంలో రాజయక్ష్మవ్యాధికి ఔషధం లేదు. వాడు "యిక్సురే" తియ్యమంటాడు; తీశావు. ఊపిరి తిత్తులు చెడిపోయినవి అన్నాడు. ఏంచెయ్యమంటావు? మదనపల్లి వెళ్లు. కొన్నాళ్లు రాజమండ్రి వెళ్లు. అక్కడ గదులు ఖాళీ లేవు. ఎవరిచేతనైనా సిఫారసుచేయించుకోవాలి. ఇదేమి మదూ? ఇదేమి ఔషధం? ఇదేమి రాజ్యం? అరే, వాడికి ప్రాణంమీదికి వస్తే వాడికి వైద్యంచేయించుకోటానికి సిఫారసులా? దానికింత డబ్బు ఖర్చా? వాడు పేదవాడైతే చావు మను. ఈ పిల్లవాడికి యీ వ్యాధి వచ్చింది. ఆ వ్యాధి యితరులకు రాకుండా కట్టుదిట్టంచేసుకోవద్దూ? అది అంటువ్యాధి. అది ఇతరులకంటకుండా కట్టుదిట్టంచేసుకోటం న్యాయమేగా. అదీ రాజుగారుచేసినపని. ఈ పులుల ప్రళయం అడవిలేని ఊళ్ల మీదకుకూడా వ్యాపించకుండా సరిహద్దుల్లో సైనికులను పెట్టారు. మరి లోపలివాళ్ల మాటో? బాగుందే. విషంలో పురుగు విషంలోనే బ్రతుకుతుంది. ఎంతవిషమైనా అన్నీ విషంలోనే బ్రతకగలపురుగు లుంటవా? అందుచేత ఆ అడవి వదలి పెట్టి నిరాబా ఊళ్లలోనికి పారిపోయివచ్చారు. కొందరు ఆ పులులతోనే పోట్లాడుతూ క్రిందామీదాపడుతూ ఉన్నారు. మరికొందరు రాలేక చస్తే చస్తామని అక్కడే ఉన్నారు. రాలేక అంటే రావటానికి ఎంతఖర్చూ? ఎంతకష్టం?



ప్రమాణపత్రం అని ఒక శాస్త్రం ఉంది. ఇల్లా లోకంలో ఉండే లోకోక్తులను, నానుడులను శాస్త్రాలంటారేమిటో! శాస్త్రాల్లో ఉండేమాటలు ఎంత నిజమో ఈమాటలు అంత నిజమని అర్థము కాబోలు. అట్లా చూస్తే శాస్త్రాలకన్న ఇవే నిజమేమో! అంటే ఇవి యెక్కువ నిజమనికాదు. పరభాషా సాంప్రదాయ మత విశ్వ సంస్కారాలు ప్రబలితే శాస్త్రాల మీద అభిమానం గౌరవంపోవచ్చు. ఈ లోకోక్తులమీద గౌరవం పోదు. ఈ లోకోక్తులమీద గౌరవం ఆ భాషకు ప్రాధాన్యం పోతే పోతుంది. ఆహా! ఏభాష అయినా అంత పూర్తిగా నశిస్తుందా! అంటారు. అయ్యో ఎందుకు నశించదూ! ఆ భాష చదివితే అన్నోదకాలు లేవనుకోండి; ఆ భాష ఎవరు చదువుతారు? పెద్దపెద్ద ఉద్యోగాలు కావలసినవాళ్ళూ, మంత్రిపదవులూ అవీ కావలసినవాళ్ళు చదవరు. దానిదుంప తెగిరిలే. శాసన సభలలో సభ్యులుగా ఉండేవాళ్ళయినా చదువవచ్చుగా అని అంటారా? చదువవచ్చుననుకోండి; వాళ్ళు అదీ చదవక్కరలేదు. వాళ్ళకి చదువెందుకు? పలుకుబడి కావాలి. కనుక ఒక దేశంలో ప్రధానంగా కావలసినవి రెండు. ఒకటి ఏభాషలో రాజకీయ వ్యవహారాలు సాగుతుంటయ్యో ఆ భాష రావటం ఒకటి. దేశంలో పలుకుబడిఉండటం ఒకటి. 'మాతృభాష ఉందనుకోండి. రాజకీయవ్యవహారాలు ఆ భాషలో జరుగవు. ఆభాష.

యెవడికి కావాలి? ఆభాషల్లో బాగా వ్రాయటమేమిటో! బాగా మాట్లాడటమేమిటో? అందులో పలుకుబళ్లూ, లోకోక్తులు, చమత్కారములైన శబ్దాలూ, అందములైన అర్థచ్ఛాయలూ, అన్నీ నేర్పటం ఎవరికి కావాలి? నేర్చినవాడికి గడ్డిబాటుందే? 'ధనమూల మిదం జగత్!' 'సర్వే జనాః కాంచన మాశ్రయంతి' కారయ్యా వాళ్లనుమాత్రం ఏమంటాం. నీవు కడుపుకట్టుకొని దమ్మిడీపలకని నా భాష చదువ్రా అంటామా? 'ఆయురన్నం ప్రయచ్ఛతి' అంటారు. ఆయుర్దాయం ఉంటే అన్నం అదే వొస్తుంది అని కొందరు చెప్తారు దీనికి. అది నిజంకాదు. ఇందులో కర్త ఆయువు కాదు; అన్నం. అన్నము ఆయువునిస్తుంది అని అర్థం. అన్నం తినకపోతె ఎట్లా బ్రతుకుతాడు? అందుచేత పరభాషే చదవాలి. దానినే పోషించాలి. కానీయండి. వాళ్లచేతుల్లో ఉండదాయె. పైగా వాళ్లేమయినా 'మాతృభాష' అంటే అభిమానం లేనివాళ్లా? చాలా అభిమానంకలవాళ్లాయెను. మనభాషకు ఆ శక్తి లేదు. మాతృభాషకు ఈ పరిస్థితి ఎల్లాంటిదంటే 'పులిమీదపుట్ర' వంటిది. అంటే ఏమీ లేదని అర్థం. ఇంకా బాగా విప్పిచెప్తే అది ఒక శూన్యవాదమని అర్థం. ఏమీ లేదుగదా? వాదించడం ఎల్లా? అంటారు. వాదించటానికి ఉండటం ఎందుకు? ఉంటే వాదించటం ఎందుకు? అదీ 'పులిమీదపుట్ర' అంటే.

ఇంతా ఎందుకు వ్రాశామంటే? మన దానవాయపాలెం; దీనినిబట్టి ఆ అడవిఅంతా ఈ పులులు తిరగటం; ఈ

మహాబాధ అంతా ఉండగా ఈ పులులు ఉండగా దీనిమీద ఒక పుట్ట బయలుదేరింది. అంటే ఈఊళ్లల్లో ఉండే మనుష్యులే కొందరు—వాళ్లు పులులపక్షంగాదు. ప్రజలపక్షం గాదు. రాచరికంవారిపక్షం గాదు. వాళ్లొకళ్లు బయలుదేరారు. వాళ్లు పులులతో షరీకు. షరీకు అని పులులూ వాళ్లూ కలిసివస్తారా? పులులంటే వాళ్లకీ భయమే. కాని పులులు వచ్చి దాడిచేసి పోతవి. పులులవెంటనే ఇద్దరు వస్తారు. ఒకటి నక్కలు, రెండు వీళ్లు. నక్కలు వచ్చి చెదరిపోయినమాంసపుముక్కలకోసం దేవులాడుతవి. వీళ్లు వచ్చి చెల్లాచెదరైన నగలూ, నాణెములూ మొదలైనవాటికోసం దేవులాడుతారు.

వీళ్లల్లో కొందరు పులులవలె గర్జించగలుగుతురు. పులి ఎన్నిరకాలుగా ధ్వనిస్తుందో అన్నిరకాలుగా ధ్వనిచేస్తారు. చంపినవేట యెదురుగా ఉంటుంది. పులి యెదురుగుండా కూర్చుంటుంది. గద్దలుగాని, అల్పమృగాలుగాని ఆ వేటమీదకు రాబోతవి. అప్పుడు పులి ఒక గుఱ్ఱుపెడుతుంది, ఇది ఒకటి.

పులి దూరంగా వేటను చూస్తుంది. ఆ వేటమీదకు దూకబోయేసమయంలో దాని నెవరైనా అటకాయిస్తారని అది అనుకుంటుంది. అప్పుడు "గాండ్రు" పెడుతుంది. ఇది ఒకటి.

పులి వేటని కొడుతుంది. వేటమీదికి దూకుతూనే ఆ జంతువుయొక్క మెడనరాలు బిగించిపట్టుకొని ఆ పట్టుకొనటం

లోనే నెత్తురు కీలుస్తుంది. అప్పు డొక బుస్సుకొడుతుంది. ఇది ఒకటి.

ఇల్లాగా పులి అనేకరకాలైనధ్వనులు చేస్తుందికాదూ! ఈ పుట్రగాళ్లకి ఇవ్వన్నీ తెలుసు. అందుచేత పులిలేనిచోట పులిని మొలిపిస్తారు. పులిరానిచోట పులిని కలిపిస్తారు. ధ్వనులకు బెదరి జనం పారిపోతే చెయ్యాలసినపని చేస్తారు.

పురాణాలకథలు నమ్మరుగానీ, సరిగ్గా అల్లా అడుగుల్లో నడుస్తున్నది. పూర్వ్యంబకాసురుడు ఉన్నాడనుకోండి. ఏకచక్ర పురంవాళ్లు ఏంచేశారు? ఓరి! మహారాక్షసుడా! మా ఊరంతా ఒక్కసారి నిర్ధూమధామంచేస్తే నీకేంలాభం? ఇంటింటికీ వంతులుపెట్టుకొని నీకు ప్రతిరోజూ ఒకదున్నపోతు, ఒకమనిషి ఎస్పోర్టా పంపిస్తా మన్నారు. ఆ అడవిలోఉన్న ఊళ్లల్లో కొందరు పులులతోను పుట్రలతోను ఇల్లాంటి రాయబారాలు చేసుకొన్నారు. ప్రతినెలా ఆ వూళ్లవాళ్లు ఆ నియమం చెల్లిస్తుంటారు. వాళ్లకి అంత ఎద్దడిలేకుండాఉంది. అదేమిటి ఇంతా చెప్పి అంద ఎద్దడిలేదంటావేమిటి? అంటారా! నిజానికి అసలు ఎద్దడి పోలేదు. అవతలవా ళ్లెవళ్ళు? పులులు పుట్రలూనాయె. నెలసరిరాబడి నెలసరిరాబడే. మధ్య ఏదైనా అవసరంపడుతూంది. ఎప్పుడు అవసరంపడితే అప్పుడు వస్తారు. ఆ అడవి అంతా వారికి "అసివారుగానేగుసట్టిబయలు" కదా! వాళ్లని కాదనేవా ళ్లెవరు?

అసలు కంపెనీ సర్హద్దు బయట ఒకానొక చోట పుట్ర కంటె పుట్ర బయల్దేరింది. ఈ పుట్ర క్రమంగా చియ్యాబట్టింది. "ఏందుకున్నమ్మ ఒక పేరంటం. అందుకున్నమ్మకి అన్ని హారతి" అన్నట్టు తప్పెవడిది? పాలించుకొనేవాడికి, ఏదో సామాన్యమైన ఉద్యోగం చేసుకొనేవాడికి, వాళ్ళకి చెయ్యాలనుకు కాని, దోచుకుతినే భూపుల కేమున్నది? వెనకటికి ఉప్పెనవచ్చి ఆ సముద్రతీర దేశమంతా కొట్టుకపోతే ఆదెబ్బలో చాలా సంసారాలవారు ధనవంతులైనారట.

పులులు రైళ్ళమీంద పడతవి, ఊళ్ళమీంద పడతవి. నానా భీభత్సం చేసి వెళ్ళిపోతవి. ఆసమయంలో పుట్ర వెళ్ళి నగలు దోచుకువస్తుంది. నాణాలు ఎత్తుకువస్తుంది. జనపహరీ, పాత్ర సామగ్రీ ఒక టేమిటి? యథేచ్ఛంగా ఆసమయంలో చేతికలందిన దల్లా తీసుకువస్తుంది. అందనిదేముంటుంది? చెయ్యుంటూ ఉండాలి కాని. పుట్ర చేతులు బారెడుబారెడు చేతులు. దానికి ఆశ ఎంతపొడుగో, చేతులు అంతపొడుగు.

అసలు పులుల దేముంది? పుట్రకథే ఎక్కువైంది. ఆ పుట్ర ఏంచేసింది? అంటే? రత్నాలు, నగలు, ధనమూ ప్రోగు చేసింది. అవతల రాజూ ఇవతల తానూ అన్నట్టుగా బయలు దేరింది. ఆ అడవిలో మూడు అధికారాలుగా ఉన్నవి. రాజు గారి అధికారం ఒకటి. పేరికేమో చలాయింపే లేదు. ఆ రాజుగారి సైన్యాలు అడవిఅంచులలో ఉంటవట అని ప్రతీతి. నిజంగా

ఉన్నవేమో? ప్రయోజనం లేకుండా ఉన్నవి; ఉంటేనేం? ఉండక పోతేనేం? వ్యాధితో బాధపడేనోడికి ఈ వ్యాధి ఇతరత్రా వ్యాపించకుండా కట్టుదిట్టాలు చేశారు, అన్నవార్తవల్ల వాడికేమి సంతృప్తి? అన్నింటికన్న పెద్దఅధికారం ఇది. ప్రస్తుతం మాత్రం అది 'అస్తి నాస్తి విచికిత్సా హేతువు' గా ఉంది.

రెండవఅధికారం అసలు నిజమైనఅధికారం. అమలులో ఉన్న అధికారం పులులది. పులులదని విస్పష్టంగానే ఉన్నది. మూడవఅధికారం ప్రుటది. ఒకవిధంగా చూస్తే పులులకంటే ప్రుటదే ఎక్కువఅధికారంగా ఉంది. ప్రుట పులులనుచూచి భయపడుతూనేఉంది. పిల్లలుచెప్పుకొనేకథలో ఉండే పులికి ప్రుట అంటే భయంకాని, మన నిజమైనపులులకు ప్రుటఅంటే అంత భయం ఉన్నట్లు కనిపించటంలేదు. ఈ ప్రుటకి ఒక ఆశ ఉన్నది. రాజుగారు ఈ పులులన్నీ తన ప్రజలను ఇట్లా బాధిస్తూఉంటే ఎన్నాళ్ళు ఊరకుంటాడు? పాపం ఎప్పుడో పండుతుంది. అత డెప్పుడో ఈ పులుల్ని వధించటానికి వస్తాడు. పులులు రాజును చంపేస్తవి. రాజు పులుల్ని చంపివేస్తాడు. అప్పుడు అడవిరాజ్యం అంతా తమదే అవుతుందని. వెనకటికి ఒకాయన వ్రాశాడులెండి. రెండుత్రాచుపాములట, దీని తోక అదీ, దానితోక ఇది పుచ్చుకొని మ్రింగటం మొదలు పెట్టినవట. దీనిని అది మ్రింగివేసింది. దానిని ఇది మ్రింగివేసింది. ఇంక ఏపాము మిగలలేదు. చూస్తే రెండుపాములు లేవు. ఎట్లాఉంటవి. ఇది దానికడుపులో ఉండె. అది దీని కడు



ప్రజలో ఉంటే. ఎదురుట తేప్పుగా. అట్లా ఉంది. పుత్ర ఆలోచన ఎట్లాఉందం పోనీఏం! పుత్రుడని ఇష్టము బాగానే ఉంది. రాజుకైనా తబ్బుకి కాడునఉంది కాని, జానిషని మంచి బాగుంది. ఇష్టము రాజువని అపేనా! అన్నట్లుగా ఉంది. పులిమీదపుత్ర అంటే బుది.

# ౧౦

తుపాకగుళ్లు తగిలితే పులులు తప్పకుండా చస్తవి. ఆ తుపాకులు ఎవరిదగ్గర ఉన్నవి? రాజసైనికులదగ్గర ఉన్నవి. ఆ రాజసైనికులు తుపాకులు ఎందుకు బారుచెయ్యరు? రాజాజ్ఞ ఎందుకులేదు? ఇక్కడ ఉన్నది చమత్కారం. చీమా! చీమా! ఎందుకు కుట్టావు? అన్న కథల్లే ఉంది. రాజుగారికి ఎట్లా తెలుస్తుంది? రాజుగారు తన అంతఃపురంలో ఉంటాడు. వెనుకటికి శౌద్ధోదనికి మృతుణ్ని, జరాపీడితుణ్ణి చూపించవద్దన్నారట, వాళ్లను చూచినంతమాత్రంలో ఆయనకి వైరాగ్యోదయం కలుగుతుందని. అరే! రోజూ మనం ఎంతమంది వ్యాధిగ్రస్తులను చూస్తున్నాంకదూ. బజారువెంట వెళ్లుతూంటే ఎదురుగా ఎన్ని బాజాలు వస్తున్నవి? మనం సంసారాలువదలిపెట్టి వెళ్లిపోయినామా? ఆ బుద్ధుడు అంత దయావంతుడు గనుక ఆయన అట్లా అవుతాడని భయపడ్డారు. ఆ బుద్ధు డెట్లాంటివాడో రాజుగా రట్లాంటివాడు. రాజుగారికికూడ మృతులు, రోగస్థులుగా కనిపించగూడదు. వెంటనే వైరాగ్యోదయమై రాజ్య

పరిత్యాగం చేస్తాడని కాదు. ఇది ఆయన రాజభోగంలో ఒక భాగం. ఆయనకు బాగా తెలుసు, లోకంలోఉన్నజీవులు కోటి విధాల బాధపడుతూంటారని. కాని వాటినిగురించి ఆయన ఆలోచించడు. ఎందుకాలోచించడంటే? అసలు ఆయన దేనిని గురించి ఆలోచిస్తాడు గనుక దీనినిగురించి ఆలోచించడానికి. మరి ఆలోచనలేకుండా రాజ్యం ఎల్లాచేస్తాడు? ఈ రాజ్యసంబంధమైన ఆలోచనలు అంతా క్రిందిఉద్యోగులు చేయాలి. ఈ క్రిందిఉద్యోగులంతా ఆలోచనచేసి "ఈ పులులమీద తుపాకీగుండ్లు వదలాలి" అని తీర్మానంచేసే ఆ తీర్మానం రాజుగారికి అందిస్తే ఆయన సైనికులకు "తుపాకీగుండ్లు వదలండి" అని ఆజ్ఞాపిస్తాడు. అటువంటిఆజ్ఞే రావాలిగాని సైనికులు పులులని కసకస నూరుకోత్రాగరా? ఎందుకు సైనికులకంత కోపం? అంటారేమో! వాళ్ళచుట్టాలల్లో ఎంతమందిని ఈ పులులు చిత్రవధ చేసినవి? ఆ కోపమంతా వాళ్ళ డొక్కల్లో అణగుతునే ఉంది. ఎప్పుడో ఒకప్పుడు రాజుగారిఆజ్ఞ రానేవస్తుంది. ఆలస్యం అవుతోందిగాని. అప్పుడే చూడండి యేమౌతుందో! ఈ పులులన్నింటినీ "చూర్ణ పేషం" గా నూరుతారో చూడండి.

మరి రాజుగారిఆజ్ఞ రాదాయె. ఆజ్ఞ రావటానికి మరి రాజుగారిఆలోచన పూర్తికాలేదాయె. పూర్తికావటం అంటే క్రిందిఉద్యోగస్థుల సోపానపంక్తి ఉందిగా. ఇది మెట్టుమెట్టూ అనుకూలంగా యెక్కాలి. ఈ మెట్లు పరమపదసోపానపటం అలే పెద్దాక పోయినా పాముకరచిందంటే మొదటిగడిలోకి

వస్తుంది. పూర్వకవులు బ్రహ్మదేవునిగురించి 'మాకు ఆ అపకారం చేయవద్దు. ఈ అపకారం చేయవద్దు. మా ముఖాన ఇట్లా వ్రాయవద్దు. ఇట్లా వ్రాయవద్దు' అని అడిగినసందర్భాలు ఉన్నవి. "అరసికులయందు మా కవిత్వాన్ని నివేదించడం మా తలకాయమీద వ్రాయకు దేవుడా!" అని మొదలైనవి. కాని, నా అర్జివిన్నపాలు ఉద్యోగులచేతుల్లో పడవేయ్యకు దేవుడా! అన్నట్లు ఎక్కడా లేదు. పది పదకొండుగురు ఉద్యోగులున్నారు క్రిందనుంచి పైదాకా. మన చరిత్రకారుడు మొదలు రాజుగారివరకు ఒకఉద్యోగి, అంటే ఆ ఉద్యోగితోనే తేలలేదు. వాడికచేరీలో, వాడిఅదృష్టంకొద్దీ గుమస్తాలుంటారు. కొందరికి పాతికమంది. ఈసంఖ్య వెయ్యిదాకా పెరగవచ్చు. ఇవన్నీ ఉపగ్రహాలు. ఈ అన్నింటికీ భూతతృప్తి జరగాలి; ధనశాంతి జరగాలి. దానవాయపాలెం "మా యింటివెనక ఇంగువచెట్టు ఉంది; ఎంతకోసినా గుప్పెడు కాదు" అన్నట్టు ఊరు. ఆఊరు ఈ గ్రహాలతో ఉపగ్రహాలతో ఆసీమాంతం ఎక్కడ వెళ్లుతుంది? కాదయ్యా పూర్వమెప్పుడో కథ మొదలుపెట్టినప్పుడు దానవాయపాలెం ఒక్కటే గాని, ఇప్పుడు నాలుగువందలచదరపుమైళ్లల్లో ఉన్న ఊళ్లన్నీ ఉన్నవీకదా? అవన్నీ కలవవచ్చుకదా? అన్నీకలసి ఏదో వసూలుచేసి బలిహరణం వెయ్యవచ్చుకదా? అంటారు-మహాకవి కాసుల పురుషోత్తం అన్నాడు: "ఓయి భగవంతుడా నెస పృథక్ప్రకృతులకు వేరుపెట్టితివికాక అందర కైకమత్య మిడి

నావే? వేరుగతిలేక నిన్ను సేవింపవలసె'' అని. ఇదీ సృష్టిలక్ష ణం. "ఎవరికివారే యమునాతీరే." అందరూ కలిసిఉండేనేర్పు ఉంటే రాజెందుకు, రాజ్యాలెందుకు? ప్రతివాడూ ధర్మంగానే ప్రవర్తిస్తే స్మృతులెందుకు, రాజశాసనాలెందుకు?

అందుకని ఈ వ్యవహారం ఎక్కడఉన్నావే గొంగడీ అంటే, పడవేసినచోట ఉన్నానంటోంది.

ఈ కాగితం ఎప్పటికప్పుడు క్రిందనుండి బయలుదేరు తుంది. ఒక్కొక్కప్పుడు పురిటిలోనే సందుకొడుతుంది. మరి బయలుదేరి బాలారిష్టాలుకొట్టిపోతుంది. మళ్లీ బయలుదేరి చాలాదూరం వచ్చి మృత్యువువాతపడుతుంది. అంతేకాని, ఆరాజుగారిదగ్గరకు నెళ్లటం అనే మోక్షం ఎప్పుడూ కలగ లేదు.

ఇది యిట్లాఉండగా దీనిసిగురించి దేశంలోనూ ప్రపం చకంలోను చాలా గందరగోళం బయలుదేరింది. దేశంలో ఎట్లా బయలుదేరిందంటే? ఈ పులులను చంపితీరాలి, చంపి తీరాలి అని కొందరు ఉపన్యాసాలు, తీర్మానాలు; ఊరేగిం పులూ; ఈ కథఅంతా రాజుగారికి తెలిసింది. అది నిజంగా తెలియటంక్రింద రాజుగారు లెక్కకట్టరు. అసలు కాలువ వెంటనే రావాలి. అనగా అధికారులద్వారా; అదే తెలియ టంక్రింద లెక్కకట్టుతారు.

ఎల్లాగైతేనేమి? ఒకపని జరిగింది. ఏమంటే అడవిలో ఇప్పుడు ఏభై అరవై పులులున్నాయని చెప్పవచ్చు. సంఖ్య ఇద

అడవిలో గడ్డికోసుకోటానికి వెళ్ళినట్లు వెళ్తాడు. భుజముమీద గొడ్డలివలెఉంది. గొడ్డలికి ఉత్తరీయం చుట్టాడు ఎందుకన్నా! కొనుతే బాట్లకు చొక్కాలు తొడగటంలేదూ ? అంటే టెన్నిసుబాట్లు బాడ్మింటనుబాట్లుకూ. కత్తికి వర లేదూ? ఎవళ్ల ఆయుధాలకు వాళ్లు చొక్కాలు తొడుగు తుంటారు మనకేం? అది నిజంగా గొడ్డలికాదు. అది మేక కాలో దున్నపోతు కాలో! ఎందుకయ్యా తీసుకొనివెళ్లు తున్నాడు? పులికి ఆహారంకోసం. అరె గొడ్డలికి ఎక్కడైనా గుడ్డ చుట్టారా? అని విచారించరేం అధికారులు? రైళ్ల మీదుగా ఎన్ని వెళ్లుతున్నవి! ప్రతిరైలుదగ్గరా ప్రతివాణ్ణీ వెదకిపంపించవచ్చుగా. అదికాదు అందులోఉన్న రహస్యం. అల్లా వెదికేందుకు కొంద రుద్యోగులు ఏర్పాటైఉన్నారు. వాళ్లుతప్ప తక్కినవాళ్లు వెదకకూడదు. వాళ్లు కొద్దిమంది ప్రతిచోట ప్రతిసారి ఎక్కడ వెదుకుతారు? కనుక పోనీ.

కాదయ్యా ఎవడినన్నా పట్టుకుంటారు. వాడిమీద కేసు పెడతారు. జామీనుమీద విడుదలచేసారు. కేసు ఆరు నెలలు. ఈలోపుగా ఏ చెరువుకి నీరెక్కుతుందో!" కట్ట తెగుతుంది. వీడిమీద కేసే సాక్షీదాగా పోతుంది. స్మృతికాలం అంటే మనపూర్వరాజులు ధర్మశాస్త్రప్రకారం రాజ్యం చేసేకాలం. ఆరోజుల్లో శిక్షలు మహా కఠినంగా ఉండేవట. దొంగతనంచేస్తే చేతిని తెగగొట్టేవాళ్లట. ఇంక వాడు దొంగతనంచేయడు సరికదా, భయపడి ఎవ్వడూ చెయ్యడు.

కఠినమైన దండనీతి భయాన్ని కలిగిస్తుంది. మనిషికి భయం ఉండాలి. అందుకనే మనవాళ్లు "వాడికి భయం భక్తీ లేవంటారు.

సత్పురుషుడు వాడంతటవాడే ధర్మంగా ఉంటాడు. అసత్పురుషులను రాజు భయంచేత ధర్మమార్గంలో నడిపించాలి. వెనుకటికి శివాజీమహారాజు రాజ్యంచేసేటప్పుడు పూనానగరంలో-దొంగతనంఅంటూ ఉండేదికాదట. లేదని ఒక బుడతకీచువాడితో చెపితే వాడు నమ్మక ఒక వందవరహాలసంచి పూనాలో నడిబజారులో వదిలిపెట్టి పోయినాడట. తరువాత ఆరునెలలకు వచ్చి చూస్తే జనం అందరూ దారికి అడ్డంగాఉందని ఆ వరహాలసంచిని ఒక గోడప్రక్కగా త్రోశారట. అదీ నిజమైన రాజభయం అంటే. ధర్మాన్ని పాలించటం అంటే పులులకు మాంసం తీసుకొనివెళ్లేవాణ్ణి ఒక్కణ్ణి ఉరితియ్యండి. మళ్లీ మర్డర్; తక్కినవాళ్లకి హడలేనాయెను. అబ్బో ఈ రాజ్యంలో ఉరిఅంటే ఎంత కథ? అవతలవాణ్ణి చంపెనూ – వీణ్ణి చంపటానికి సంవత్సరాలూ కోర్టులూ. చివరకు టుస్సుమంటుంది. దండనీతి మహారాజులకు తేలింది. అధర్మం చిలవలు పలవులు తేలుతోంది.

# ౧౧

ఈవిధంగా సర్వప్రయత్నాలూ విఫలమైనవి. పులుల
కథ యథేచ్ఛంగా సాగుతున్నది. సైన్యాలు రావటంగాని,
రాజుగారు వేటగాండ్రను పంపించడంగాని జరగటమునేది
కనుపించలేదు. ఎన్నివిధాలచూచినా యీ బాధ తప్పేటట్లుగా
లేదు. పులులు రైళ్ళ మీదబడి తింటూనేయున్నవి. కొందరు
దుర్మార్గులు వాటికి దోహదంగా ప్రోత్సహిస్తూనేఉన్నారు.
పైగా వాటికి మనుష్యుల్ని చంపాలసినంత యవసరమూలేదు.
గొఱ్ఱెలనూ మేకలనూ పశువులనూ తీసుకవెళ్ళి వాటికి చాలా
మంది బలిహారం ఇస్తూనేఉన్నారు. ఈ సందర్భంలో మరిఒక
చమత్కారం జరిగింది. కొన్ని ముఠాల మనుష్యులు సశిర
స్కంగా ఉండేటటువంటి పులిచర్మాలు సంపాదించి సంజవేళ
లందు నడిరాత్రులందు వానిని కప్పుకొని ఊళ్ళమీద దాడీ
చెయ్యడం మొదలెట్టారు. వెలుగులకు బరిస్తేలు గ్రుచ్చిన రాత్రు
లందు పులులు దూకిరావేవుగదా అని చేసికొన్న భద్రం ఈ
విధంగా చెడిపోయింది. ఈ పులులు అసలు దూకనేదూకవు.
నడిచేవస్తవి. వెలుగుల త్రాళ్ళు ఊడదీసి వస్తవి. సందులలో
నుండి దూరివస్తవి. ఈ పులులకు కాళ్ళేకాదు చేతులుకూడా
ఉన్నవిగదా

మొదటిరోజుల్లో ఈ పులులనుచూచి గ్రామాలలో
ఉండే ప్రజలు భయపడ్డారు.

ఈ పులులు మనుష్యులను వేసికొనిపోవు. కత్తులతో పొడిచి చంపుతవి. ఇళ్లల్లో వున్న ధనాన్ని దోచుకొనిపోతవి. ప్రొద్దున్నే చూస్తే శవాలుంటవి. కత్తిపోట్లుంటవి. పులిగాటు లేదు. పంజాదెబ్బగుర్తు లేదు.

ఈ కొత్త వ్యాఘ్రముల బాడి ఒక విచిత్రంగా పరిణమించినది. ఊళ్లల్లో వుండే పేదవాళ్లకంతా మన మీరో పులుల్లో చేరితే బాగుంటుందనిపించింది. ఇంతమందికీ పులిచర్మాలెక్కడ దొరుకుతవి. అందుచేత పులిచర్మాలైనా కప్పుకోటానికి లేని పులులవలె పిళ్లు తయారైనారు.

అసలుపులులకు పిళ్లకూ స్నేహం మేర్పడ్డది. అసలు పులులు పిళ్ల జోలికి రావటంలేదు. పిళ్లు పులులజోలికి పోరు. కాని అప్పుడప్పుడు పులులకు పిళ్లకు సంఘర్షణ జరగటం లేకపోలేదు. ఒక పేయెరకోసం ఆ నిజమైన పులులు ఈ ఉత్తి పులులు సమావేశమైతే కొంచెం యుద్ధం జరగటం, అసలు పులులు పారిపోవటం. ఎందుచేతనంటే? ఈ ఉత్తమ పులుల దగ్గర పెద్దపెద్ద తుపాకులుగూడా యున్నవి. వాటికి తుపాకులుపయోగించడం బాగా చేతనౌను.

పిళ్లను చూచి అసలుపులులుగూడ తుపాకుల్ని సంపాదించినవి కాని, వాటిని ఉపయోగించటం చేతకాలేదు.

అసలుపులులు మొదటిరోజులలో అడవిమృగాలల్లే ఉన్నవి గాని తరువాత తరువాత వాటికి మనుష్యుల తెలివి తేటలుగూడ కొంత వచ్చినవి.

ఈ తుపాకులు వాడటం మనచేతకావటంలేదు. పెట్టిసి వాడడం నేర్చుకుందామని పుట్టింది. ఎవరు నేర్పుతారని పుట్టింది. అసలు తుపాకీ సృష్టించిం దెవరు? అందుచేత వాడినే పిలిపించేసు. నేర్పరా! అన్నారు. వాడు వాళ్ళవాళ్ళని మరికొం దరిని తెచ్చాడు. ఈ పులులు వాళ్ళ నేమీ చేయగూడదని ఒక నియమం. కాని ఇవి పులులయ్యె. ఆ నేర్పేవాళ్ళనీ వదిలిపెట్ట లేదు. అందుచేత పెటాకి సరిగా నేర్పలేదు. అసలు ఆ అడివి జంతువులకు నేర్చుకునే శక్తియే లేదు. ఎవరైనా కనిపిస్తే వాడిని తిందామని మీదకు దూకడమేతప్ప తుపాకితో కాలు ద్దామనే ఊహాయే పుట్టదు. పైగా తుపాకీ ప్రయోగిస్తే వాటికి భయం. అందుచేత నేర్పటానికి వచ్చినవాళ్లకి యథేచ్ఛంగా ఈ పులులడబ్బు దక్కటమే కాని ఫాయిదా లేకపోయింది. "బ్రతక లేక బడిపంతు లంటారు." అట్లాగే శత్రువులను నిగ్ర హించడంలో ఆయుధశక్తి లేక శరీరశక్తి లేకపోతే గాంధీగారి సత్యాగ్రహశక్తి ఒకటి వుందని అనుకోవచ్చు. ఏ కొంచెమైనా శరీరశక్తి యుండవచ్చు. ఆయుధశక్తిగూడ ఉండవచ్చు. సత్యా గ్రహశక్తి అసలుండదు. కాని ఆయుధశక్తి లేదని తెలుస్తుంది. సత్యాగ్రహశక్తి ఉందని అనిపిస్తుంది. ఆత్మ మనోవిషయాలకు శరీర విషయాలకు అంత భేదం ఉంటుంది. భగవంతుడు ఈ మానవసృష్టిని ప్రతోరించటానికి యేర్పాటు చేసిన ప్రథమ ద్రవ్యం మనస్సు. ఒక సంగీతపాటకుడుంటాడు. వాడు నోరు తెరిస్తే అక్కడ కూర్చోవటానికి వీలు లేదు. అదేదో శాస్త్ర

ఉంటే "సాహిత్యానికి నేనూ సంగీతానికి మా అప్పగారు" అని ఆ అప్పగారి కోవలోనివాడు; తాను సంగీతసభలు చేస్తానంటాడు. వాళ్ళనీ వీళ్ళనీ ఆశ్రయిస్తాడు. సన్మానాలు చేయించుకుంటాడు. అస్తే మాట్లాడితే గండపెండేరం వేయించుకుంటాడు. "సంగీత సుం[illegible]' సంగీత నారద" మొదలైన బిరుదులు కూడా ఇప్పించుకుంటాడు; వీడిని పట్టుకునే దెల్లా?

ఈ రీతిగా మానసికమైన విషయాల్లో ఇదమిత్థమని నిర్ణయం లేదు.

సత్యాగ్రహమంటే గాంధీగారిలాంటివాళ్లు కావాలి. మరి నిజంగా చూస్తే గాంధీగారికంటే గొప్పవాళ్లు కావాలి మానసికంగా. గాంధీగార్ని పోలీసులు కఱ్ఱలతో కొట్టరు. వీధిలో పడవేసి లాగరు. చెరసాలలో నానాబాధలూ పెట్టరు. ఊరికే బంధించి తీసుకొనిపోయి ఒక దివ్యసౌధములో ఉంచుతారు. రాజోపభోగాలు జరుపుతుంటారు. గాంధీగారంటే గాంధీగారే కాదు. రాజకీయంగా పెద్దస్థితిలో ఉన్నవాళ్లందరూనూ. వాళ్లు నిరశనవ్రతం చేస్తారనుకోండి. పెద్ద వైద్యులు వారిదగ్గర ఉండి గంటగంటకూ నాడీస్పందనమూ, హృదయస్పందనము చూస్తూ నిమ్మనీళ్లు మొదలయినవి యిస్తూ జాగ్రత్తగా రక్షిస్తూంటారు. వెనకటికి జాడ్జిచక్రవర్తిగార్కి ఒక జబ్బు వచ్చింది. ప్రపంచకములో నున్న అత్యుత్తమ వైద్యులంతా ఆయనకు వైద్యం చేసినారు. కొండమీది కోతి కావలెనన్నా దిగివచ్చింది. అది

చాల దుర్ఘటమైన వ్యాధి. వ్యాధి నెమ్మదించినతర్వాత ఖర్చు ఎంత అయినదయ్యాలంటే! కొన్ని లక్షల పోస్తున్నారు.

ఓయి బాబోయ్ నీకూ నాకూ ఆ జబ్బువస్తే ఎట్లా? దహనంచేసేందుకు కట్టెలకు డబ్బు లేదే! ఇన్నిపోస్లు వైద్యానికే!

అన్నింటిలో ఇదే భేదం. ఆ ఉత్తమోత్తములు సత్యాగ్రహం చేయటం వేరు, నీవూ నేనూ చేయటం వేరు. ఆ ఉత్తమోత్తములు నిరశనవ్రతం పూనటం వేరు. నీవూ నేనూ పూనటం వేరూ. ఇది లౌకికవిషయాల్లో కనిపించే భేదం. ఈ భేదమే యెంత ఉన్నదో చూడండి. ఇంక ఆంతరవిషయంలో భేదం మనం ఊహించనేలేదు. అక్కడ వెలకట్టడం పైన చెప్పిన సంగీతవిషయంలో వెలకట్టడంలోవలె ఉంటుంది. ఆ మానసికవిషయాలను సమగ్రంగా తెలిసికొనటనే కష్టం, తెలిసి ఇదమిత్థమని నిరూపించటం మరీ కష్టం. మరి సత్యాగ్రహ సిద్ధాంతం చూస్తే మానసికంగా అతడు యోగికావాలి. నిర్లిప్తుడు కావాలి. ఎదుటివానిమీద ఏమీ కోపంగాని, ఈర్ష్యగాని ఉండరాదు. స్వాభిమానం అంతకంటె ముందుండ కూడదు. శరీరమందు మమకారము పనికిరాదు. శరీరమునకు ఘాతము జరుగుతుంది. బాధపడకూడదు. ఏడవకూడదు. అమ్మయ్యో! అనరాదు. పిరికిగుండె పనికిరాదు. శారీరకంగా ఇటువంటి స్థితి ఉండాలంటే ఘూర్ఖాలు ఇటువంటివాళ్లని చెపుతారు. ఒక ఘూర్ఖా-సైనికునకు ఫిరంగిదెబ్బ తగిలి

సత్యాగ్రహసిద్ధాంతం చెప్పిన మహాపురుషుడి అర్థం వ్యర్థమై అది సత్యాగ్రహమన్నమాట పోయి వేలంవెర్రి అయింది.

దానవాయపాలెంలోని కొందరు పెద్దలు సత్యాగ్రహమందు సమ్మకమూ-డీ గాదు; చేతనయీా కాదు. పులులబాధకి ఇది యేమైనా మార్గమేమో అని.

౧౨

చివరికి దానవాయపాలెంవారు సత్యాగ్రహం చేయటానికే నిశ్చయించారు. కొందరు చేయాలని. కొందరక్కరలేదని, అసలు ప్రధానమైనవారుగాక తక్కినవాళ్లెంతమందో వున్నారు. వారి వాదనలు చర్చలు అతీతమైపోయినవి. పనిచేసేవాళ్లా పెట్టేవాళ్లా? వీళ్లకు వాదనలు ఎందుకంటా? అంటే! ఏ పనీ చేయనివాడికి వాదనగాక మరేమిటి? అని వాళ్ళు అంటారు. వాళ్లే వాదించుకొని వాదించుకొని చివరికి అసలు మనకీ వాద మెందుకురా? మనం ఆర్చేవాళ్లమా? తీర్చేవాళ్లమా? అంటాడొకడు. మరొకడంటాడు అదేమిటోయి! "పనిచేసేవాడే వాదించాలా! పనిచేసేవాడసలు వాదించనే లేడు." అని. మరిఒకడు మనము ఊరికే వాదిస్తామంటారుగాని, మనము వాదించగావాదించగా నిష్కృష్టార్థం తేలుతుంది. దాన్నిబట్టి కార్యకారులు తమపని చేసుకుంటారు. చివరికి మనని వట్టి మిథ్యాచర్చవాదులంటారు, అని అంటారు. అనేకమంది అనేకమంటారనుకోండి. వాదించేవాళ్ళు వాదించటం మానేస్తారా?

ఆ బాధవల్ల ఫలితం ఉన్నదనుకుందాం. సర్వవాదనల్లా ఉండా? కొందరు కుతర్కాలు చేస్తారు. కొంద రడ్డాదిడ్డాలు మాట్లాడుతారు. కొందరు వితండవాదనలు చేస్తారు. ఇదంతా కావలసిందేనా మరి! మరీ ఆ వూళ్లో ఒక డున్నాడు. వా డవి తప్పు చెయ్యనే చెయ్యడు. వాడంటే అందరికీ భయం. వాడిని కొడదామనేరు. కొందరు వాడిని తన్నటానికికూడా ప్రయత్నించారు. కాని ఆ ఊళ్లో ఒక ముసలాయన ఉన్నాడు. చాలా మంచివాడు. ఆయనంటే ఆ ఊళ్ళో అందరికీ గౌరవం. ఆయన ఈ వితండవాదిని సమర్థిస్తుంటాడు. సమర్థించడమంటే? అతడు చెప్పిన వాదనల నంగీకరించడంకాదు, "సరే అత డా వాదన చేశాడు. మీరు దానికి సమాధానం చెప్పండి" అంటాడు. కొన్ని వాదనలకు సమాధానా లుండవు. ఎట్లా ఉండకుండా యుంటవి? అని కొందరు.

ఈ మోస్తరుగా ఊరంతా ఒక గగ్గోలు. అసలు విష యం చెప్పితేను. ఊరంటే ఒక దానవాయుపాలెంగా దిప్పాడు. ఆ ఫిర్కా అంతా అని యిప్పుడు. పూర్వం పులులబాధ హారో హారి మొదలు దానవాయుపాలెమునకున్నది. తరువాత నాలు గైదూళ్ళ వ్యాపించింది. ఇప్పుడీ కథ కొన్ని వందల ఊళ్లమీద కలపియున్నది. దీనికి "దానవాయుపాలెపు టుద్యమ"మని పేరు వచ్చింది. కొందరు 'పులుల ఉద్యమ' మంటారు. ఈ ఉద్యమం పులులది గాదు. ఈపేరు తప్పు అని చర్చావాదుల ఆక్షేపణ. పులులగురించి ఉద్యమం లేకపోతే 'పులులను సహించటానికి

గాని వాటిబాధను నివారించేటందుకుగాని చేసే ఉద్యమం అని కొందరు భాషావేత్తల సమాధానం. కొంచెం సంస్కృతం గతికినవాడు 'శాకపార్థివవత్సమాసః' అన్నాడు.

ఏతావతా తేవాదేమిటంటే? ఇప్పుడు దానవాయపాలెం అంటే పులుల సిర్కాలంతా అన్నమాట. లేకపోతే దానవాయపాలెంలో మన చరిత్రపరిశోధకుడు తప్ప మరెవళ్ళూ విద్యాగంధం ఉన్నవాళ్ళు లేరు. ఇంగ్లీషుచదువులు ముదిరితేనే గాని వాదనలు బలవవు. అంత వాదనలకు ఒక్కదానవాయపాలెమునకు త్రాణ ఎక్కడిది?

•

వాదనలమాట తర్వాత చూద్దాం. అసలుసత్యాగ్రహమంటే యేలా జరుగుతోంది? దాని పథక మేమిటి? అనేది విచారిస్తే అస లీ ఊహ ఎవరికిపుట్టింది? అనే విషయం నిర్ధారణకి వస్తోంది.

గంగి నీడని ఆ సిర్కాలో ఒకడున్నాడు. వాడిని చిన్నప్పుడు అగమ్మకాకి అనుకునేవాళ్ళు. మొట్టమొదటప్పుడో గాంధీగారు తెనుగుదేశానికి వచ్చినప్పుడు ఈయన ఆయన వెంట వెళ్ళాడు. ఆయన వెంట వెళ్ళానంటాడు; నిజానికి వెళ్ళలేదు. వెళ్ళాడు. ఆయన వెంట వెళ్ళలేదు. అంటే రైలెక్కి వెళ్ళిన తర్వాత సంవత్సరానికి కాలీనడకని వార్ధా వెళ్ళాడు. ఆ భాష తెలియదే! దారి తెలియదే! దారిలో కాలవలుగట్రాగదా! పెద్దపెద్ద నదులయ్యోను. అడవులయ్యోను. రేగి నీ కడుపుడకా

ఎల్లా వెళ్ళావురా? అంటే? గంగిగి డంటాడు. "తాతా, ఇం కుల్లో ఆశ్చర్య మేముంది? పూర్వం రైళ్ళు లేనప్పుడు మన పూర్వులంతా కాశీ, గయా వెళ్ళివచ్చేవాళ్ళు కాదూ" అని అంటాడు. అంటే ఊరుకొన్నారూ? చర్చావాదులు? ఆ రోజుల్లో రైళ్ళు లేవు గనుక కాశీ మొదలు రామేశ్వరంవరకు పెద్ద రోడ్డుండేది. అటూ ఇటూ చెట్లుండేవి. మధ్యమధ్య నెట్టనెట్ట బావు లుండేవి. సత్రా లుండేవి. ఏ వనుకున్నంత కష్టం కాదా ప్రయాణ మన్నారు. ఇప్పుడా దారులన్నీ కట్టి పట్టవి. ఆ బావులన్నీ పూడ్చారు అని అంటే అందుకనే రైళ్ళు వేశా రన్నాడు. ఈ ప్రశ్నలూ సమాధానాలూ చిత్ర చిత్రంగా ఉంటవి. ఎవళ్ళూ గాబరాపడకూడదు.

## ౧౩

ఆ ఫర్కాలో ఒకడున్నాడు. అతడు ప్రతి దానికి ఒక పద్యం చదువుతాడు. 'ఇవాళ గేదె యీనిందిరా' అను. అయ్యో పెద్దలు అదే చెప్పారు. "కరయుగములు చరణంబులు। నురములు లాటస్థలంబు నున్నతభుజముల్। సరి ధరణి మోపి మ్రొక్కు-నా। బరువడి సాష్టాంగ మండ్రు పరమమునీంద్రుల్" అన్నారా మునీశ్వరులు. గేదె తప్పకుండా యీనవలసిందే నంటాడు.

మరి ఆ వ్యవహారం అల్లా పైసలైంది. ఇవ్వాళ మా మేనమామగారు మా యింటికి వచ్చాడు. తమ రా కుర్చీమీద కూర్చోండి. నీవేమాటన్నా సరే వాడొకపద్యం చదువుతాడు.

కనుక ప్రశ్నలకూ సమాధానాలకు సంబంధం ఉండాలసినట్లు కనబడదు.

ఇంతకూ గంగిరెడ్డి వార్ధా వెళ్లి వచ్చాడన్న విషయంలో మాత్రం సందేహం లేదు. మరి లేకపోతే ఖద్దరు అంగవస్త్రం ఎందుకు కట్టుకుంటాడు — చొక్కా యెందుకు తొడుక్కోడు? గాంధీ టోపీ యెందుకు పెట్టుకుంటాడు? లేకపోతే చేతికదురు దారం ఎందుకు తీస్తాడు? కనుక వార్ధా వెళ్లి వచ్చాడన్నది మాత్రం నిశ్చయం. ఇవంతా ఇట్లా చెప్తే అతనిని ఆక్షేపించినట్లుంటుంది — ఆక్షేపణేం? ఆ ఊళ్లో అతనిని కొందరు చర్చావాదులు అనేమాటలే ఇవి—ఇల్లా పరోక్షంగానే కాదు—ప్రత్యక్షంగానూ అంటారు—అతని మొగం మీదనే అంటారు — గంగిరెడ్డి నవ్వేసి ఊరుకుంటాడు — ఆయన సాధువు కాదనటం ఎల్లాగా? నిజంగా సాధువే—అంతే. సాధువు మాత్రమే. ఈ చర్చావాదుల్లో ఉన్న తెలివి సగమైనా అతనికుంటే ఆ సాధుత్వం బాగా భాసించేది. ఖద్దరు వడకటానికి తప్ప మరెందుకూ పనికిరాడు—అతడు వివాహం కూడా చేసుకోలేదు. నిత్య బ్రహ్మచారి—అన్నం తినడు — అన్నమంటే బియ్యంతో వండింది అని అర్థం—ఎందుకురా ప్రతిదానికీ యిట్లా అర్థం చెప్తాడూ అంటావేమో? ఆ ఫిర్కాలో అన్నీ తగాదాలే. ఏది తినబడితే అది అన్నం — ఏదో ఒకటి తినటం చేదా? అది అన్నమే. అన్నం తినటంలేదని ఎల్లా అంటావు? అని అంటాడు వాడు—వాడంటే వితండవాది, శాస్త్రమంటాడు కదా? చెప్పు, సమాధానం చెప్పు—

అంటాడు — సమాధానం ఉంది అని ఎవరికీ తెలియ దిక్కాడ-వాదనానిపుణులేగాని గట్టిగా తెలిసినవాళ్లెవరూ లేరు.

సరే గంగినీడు ఇల్లాంటి ఉత్తముడు. ఈలాంటి సత్యాగ్రహబుద్ధి ఆయనకు పుట్టింది. పుట్టటం ఎంతేనా సబబుకదా? పుట్టదగినచోట పుట్టింది.

సత్యాగ్రహమంటే? జట్లు జట్లుగా వెళ్ళాలి. మొట్టమొదట పదిమంది వెళ్ళటం — ఆ పులులముందు కూర్చోటం — అది వాళ్ళను తినటం — ఇట్లా రోజూ పదిమంది వెళ్ళటం. ఛీ, ఎన్నాళ్ళు వీళ్ళని తింటాం? అని ఆ పులులకు విసుగు రావాలి — లేకపోతే వాటికి జ్ఞానోదయం రావాలి "అయ్యయ్యో! రోజూ ఇట్లా మనుష్యులను తింటున్నాము, మరి మనకు ఉత్తరలోకాలుంటవా? పుట్టగతులుంటవా?" అని — కాకపోతే మనమిట్లా తింటూంటే ఇగ్లండులో వాళ్ళేమనుకుంటారు? అమెరికాలోవాళ్ళేమనుకుంటారు? ఆఫ్రికాలోవాళ్ళేమనుకుంటారు? అని నాగరకప్రపంచకాభిప్రాయానికి భయపడాలి.

అవి పులులాయెను. వాటికి ఊహా, పాడా? తెలివితేటలా? మంచా, చెడ్డా? ఇది సత్తా ఇది అసత్తా అని తెలుస్తుందా? ఆ సత్తు సత్తులోనుండి పుట్టిందా? మాయకూడా, అనాదిదే కదా! ఇల్లాంటి ఊహలా పులులకు పుట్టుతవా? అసలు గంగినీడికే పుట్టలేదు — పులులను సన్మార్గంలోకి త్రిప్పటం

ఎల్లాగయ్యా ? సత్యాగ్రహంవల్ల పులులక్రూరత్వం పోతుందా? అంటే పూర్వం ఋషుల ఆశ్రమాల్లో వారి తపోబలంచేత క్రూరసత్వములు వాటి క్రూరత్వం మానినవని మన పుస్తకాలలో ఉన్నదా? లేదా? అని అడిగాడు.

గంగినీడు సత్యాగ్రహాన్ని ప్రారంభించాడు.

అంటే సత్యాగ్రహాన్ని చెయ్యటానికి ప్రయత్నాలు మొదలుపెట్టాడని అర్థం. ఈ ప్రయత్నాలెట్లా ఉంటవి అంటే: మొట్టమొదట ఫలానావారు సత్యాగ్రహం చెయ్యబోతున్నారని పత్రికలలో ప్రకటించడం, తరువాత పత్రికల ప్రతినిధులు వచ్చి ఆయన్ని ప్రశ్నలువేశారు. ఆయన యే తాత్పర్యంతో ఈ ఉద్యమం చేస్తున్నాడు, ఇవన్నీ పత్రికల్లో ప్రకటింపబడుతవి. తర్వాత ఆయన ఒక్కడే సత్యాగ్రహం చేస్తాడో జట్లు జట్లుగా బయలుదేరుతారో, మొదటి జట్టు ఏనాడు బయలుదేరుతుందో ఈ విషయాలన్నీ ప్రకటింపబడుతవి.

ఇవన్నీ పత్రికలలో పడినతర్వాత తెలుగుదేశపు పత్రికలన్నీ పెద్దపెద్ద శీర్షికలిచ్చి ఈ వ్యవహారానికి చాలా ప్రాముఖ్యము తెచ్చినవి. అందులో ఒక పత్రిక సంపాదకీయమే వ్రాసింది. ఆ సంపాదకీయంలో కొన్ని వాక్యాలివి: "దానవాయిపాలెంవ్యవహారం తొండముదిరి ఊసరవెల్లి అయింది. రాచరికంవారు దీన్ని పట్టించుకోవడంలేదు. దినదినము పులులు చేసే ఘోరకృత్యాలు, పులులవేషగాండ్రు చేసే

ఘోరాలు మితిమీరిపోవుచున్నవి. దీనికి ఆలనాపాలనా లేకుండా ఉన్నవి. చివరకు అన్నింటికిమల్లేనే ఈ ప్రశ్నకుకూడా గాంధీగారి సత్యాగ్రహమే శరణంకావలసివచ్చింది. గంగినీడు గారు సుప్రసిద్ధులు. వారు గాంధీగారి శిష్యులు, అహింసా వ్రతులు, శాంతస్వభావులు. ఈ ఉద్యమం జయప్రదమగు గాక! వ్యాఘ్రనిర్మూలనము జరుగుగాక. వ్యాఘ్రవేషధారులకు శిక్ష జరుగుగాక" ఇల్లాంటి ఇల్లాంటి వాక్యాలు వ్రాయబడ్డవి. జనమంతా సంతోషించారు. ఈ సత్యాగ్రహ మహాత్మ్యానికి లోకం తల్లడిల్లిపోతుందని, స్వర్గంలో అగ్నిజ్వాలలు రేగుతవని, దేవతలు హాహాకారాలు పొంది బ్రహ్మలోకానికి పోయి ఎట్లాగు ప్రార్థిస్తారు. వాళ్ళందరూకలసి శతవిధాల పాలసముద్రంమీదకు పోతారు. పాలసముద్రంమీద రంగనాథుడు పడుకుని ఉంటాడు. ఆయనే శేషశాయి. పాముమీద నిద్రిస్తూంటాడు. లక్ష్మీదేవి ఆయన పాదసంవాహనం చేస్తూటుంది. ఆయననాభిలోనుండి ఒక తామరకాడ వాలుగా నాలుగైదు గజాలమేర ఆకాశంలోకి గొడుగుకామవలె వస్తుంది. ఆ చివర గొడుగా పుంటుంది. దానిలో బ్రహ్మదేవుడు కూర్చుని ఉంటాడు. ఆయనముఖాలు నాలుగూ ఒకవేపునకే తిరిగి ఉన్నవా? నాలుగూ నాలుగువైపులకూ తిరిగిఉన్నవా? ఈ విచారణ తేలలేదు. అన్నీ ఒకవైపుననే ఉన్నవనుకుంటాను. అవి ఒక్క భారతదేశంవైపునకే. ఆయన ముఖాలు నాలుగు వైపులకూ వుంటే అన్ని దేశాలలోను వాదాలుండేవిగా.

అందుచేత ఆ ముఖాలు నాలుగు ఒకనైపుకే ఉన్నవను కోవాలి. పైగా ఆయనముఖాలలో ముక్కులూ కళ్లూ చెవులూ అలుక్కుపోయినట్లున్నవి. చూచేవాళ్లకు చమత్కారమూ? ఆయనకే చమత్కారమూ? లేకపోతే ఆయన చీనావాడో జపానువాడో.

అయినా ఆయననుగురించి వర్ణన అప్పుడే యెందుకు? ఇంకా గంగినీడుగారి తపోగ్ని రేఖ బయల్పడలేదుగదా!

గంగినీడుగారు దానవాయపాలెం ఫిర్కా అంతా తిరిగారు. రెండు నెలలుతిరిగితే ఇరవైమంది ప్రోగైనారు. ప్లీడర్లు ప్లీడరీ చేసికొంటున్నారు. మేష్టర్లు మేష్టరీ చేసికొంటున్నారు. డాక్టర్లు డాక్టరీ చేసికొంటున్నారు. గవర్నమెంటు ఉద్యోగాలవాళ్లు అడుగుతీస్తే రాజ్యం సాగటం కష్టంగా. అందుచేత వాళ్లు మూలవిరాట్టులు. కదలరు కదిలితే ప్రపంచకంఅంతా గగ్గోలుపెట్టుతుంది. ఇది చిన్నచిన్న గుమాస్తాల మాట.

అసలు పెద్దవాళ్ళున్నారే, తాసీల్దార్లు, డి. కలెక్టర్లు జి. కలెక్టర్లు, పోలీసుడిపార్టుమెంటు వీళ్ళెవళ్ళూ ఈ సత్యాగ్రహాలు సహాయనిరాకరణోద్యమాలూ శాంతిసమరాలూ వీటి జోలికి రారు! వస్తే, భూచక్రపరిభ్రమణ ఆగిపోతుంది. పూర్వం రాముడు ఏకపత్నీవ్రతంచేశాడని ఓరి బాబోయి అదేమి ప్రతిష్ఠా ఒక రామాయణమే పెరిగిపోయె; మరి ఈ ఉద్యోగస్థులందరూ ఏకోద్యోగవ్రతంచేసే తీవ్రత విచారిస్తే



ఒక్కొక్కర్ని గురించి ఒక్కొక్క రామాయణం వ్రాయ వచ్చు. వ్రాసే వాల్మీకులు లేరు? లేకపోవట మేమి? ఉన్నారు. గానీ వాళ్ళందరూ ప్రణయకవిత్వాలు వ్రాసి కొంటూఉంటారు. మరికొందరు వసిష్ఠులూ విశ్వామిత్రులూ ఉన్నారు. యోగముశిష్ఠాలు అధ్యాత్మ రామాయణాలు బయల్దేరుతూనేఉన్నవి. కాని ఆ గ్రంథాలు ఏకో త్యాగవ్రతులనుగురించి కాదు. వీళ్ళందరికీ వ్యతిరేకంగా వ్రాయబడుతున్నవి. ఆ యోగగ్రంథాలు ఆధ్యాత్మిక గ్రంథాలూ పులులవేషాలు వేసికొని దానవాయపాలెం పెర్మాని గిక్కిలు కొట్టించే వాళ్ళ సిద్ధాంతాలనిగురించి ఉంటూంటవి.

సరే వినరిదారినవాళ్ళంటే సత్యాగ్రహం జట్టులోకి ఎవరు వచ్చారు? అని ప్రశ్న వస్తుంది.

శాంతిసమరం, సత్యాగ్రహం, సహాయనిరాకరణం ఇవన్నీ పెద్ద యుద్ధాలు. ఈ యుద్ధాలకు కావలసిన సేనా సేనాయకులు అందరూ దేశంలో ఎప్పుడు ఉంటూనేఉంటారు. యుద్ధం లేనప్పుడు విడుదలమీద ఉంటారు. వాళ్ళకు యుద్ధం ఉన్నప్పుడూ జీతా లుండవు లేనప్పుడూ జీతా లుండవు. వట్టి యప్పుడు నా ళ్ళేమి చేస్తారని అడుగుతారు ఊళ్ళవెంట తిరుగుతారు. వాళ్ళ కేమీ ఆస్తిపాస్తులు లేవా అంటారు. ఉంటే సత్యాగ్రహంజోలికి ఎందుకు వస్తారు? మరి యెట్లా బతుకుతారు? ఆ సంగతి దేవుని కెరుక.

గడపకి పసుపు పూసి తోరణం కట్టా రనడంతోటే వాన కురవటంతోటే కష్టాల్లో బ్రాహ్మణులు ఎలా బయలు దేరతారో అల్లాగే సత్యాగ్రహం అనటంతోటే వాళ్లంతట వాళ్లే వస్తారు. స్త్రీసంఖ్య చాలా తక్కువగా ఉంటుంది. వాళ్లందరూ దేశభక్తులు. ఏదో జయంతిఉత్సవం వస్తూంది. ఒక నాయకుడికి ఊరేగింపు జరుగుతుంది. ఆ ఊరేగింపు అంతా వాళ్లే చేస్తారు. ఏ పెద్ద కాన్ఫరెన్సు జరిగినా జెండాలు పుచ్చుకొని తిరుగుతారు. ఆ సభలు జరిగినన్నాళ్లూ వాళ్లు పడే శ్రమ భగవంతుడికి తెలియాలి. నాయకులు రైళ్లు దిగి వస్తూంటారు. వాళ్లని తీసుకొని రావటం, వాళ్ల మకాములదగ్గర కాపలాలూ వాళ్ల కన్ని సదుపాయాలూ చూడాలి. వాళ్లకు నిద్రాహారా లుండవు. మరి ఏమిటి లాభం? అంటే సేవ చేయటమనే మహా గుణం వారు నేర్చుకుంటున్నారు. సేవచేయటమనే గుణమే లేకపోతే యీ సృష్టే లేదు. మరి సేవచేయటం నీచంగా! అంటున్నా డెవరో పూర్వకాలపువాడు చాతుర్వర్ణ్యములో చివరివర్గం సేవకోసమేగా యేర్పాటు చేసింది. అది కాదోయి ఆ మాట తీసివేసి "వాలంటీరని" పిలువు; మేము వప్పుకొం టాము. సరే నాయకులూ, ప్రదర్శకులూ, అనుయాయులూ, వాలంటీర్లూ ఇది చాతుర్వర్ణ్యం. ఇందులో మాకేమీ తగాదా లేదు. చాలా బాగుంది.

గంగిసీడు ఈ ఇవన్నే మరీదిని నాలుగు జట్లుగా ఏర్పాటు చేశాడు. పులులు నాలుగైదు కుటుంబాలుగా చీలి, నాలుగైదు

వోట్లు తమ సంహారకాండ జరుపుతున్నవి కదా, ఈ నాలుగైదు వోట్లా సత్యాగ్రహం జరిపేందుకు ఈ జట్లు చాలవు; అందుచేత ఏమి చేయవలెను? అని చర్చలు సాగినవి. చివరకొక తీర్మానానికి వచ్చారు. ఈ ఐదుచోట్లా సత్యాగ్రహం చేయనక్కరలేదు. ప్రధాన మల్లనిబర్హణ న్యాయం ఉన్నదిగదా అంటే పదిమంది వస్తాదులు వస్తే అందులో గురువైనవాడిని ఓడిస్తే తక్కినవాళ్లందరినీ ఓడించినట్లే. అట్లాగే అసలు ప్రధానంగా ఈ పులుల ఘోరాలు దానవాయపాలెం దగ్గర ప్రారంభించినవి గనుక అక్కడనే సత్యాగ్రహం ప్రారంభించటం.

దానికి ఒకరోజు నిర్ణయించారు. మొదటి జట్టు నలుగురు. ఈ నలుగురూ బయలుదేరారు. దానవాయపాలెంలో పుణ్యస్త్రీలు వీరికి తిలకాలు పెట్టి హారతు లిచ్చారు. వాళ్ల మెడలలో ఖద్దరునూలుహారాలు చెవులు మూసుకుపోయేటట్లుగా వేసుకొన్నవి.

పులులు బయలుదేరాయి. బాజాలు, భజంత్రీలు మేళాలూ, తప్పెట్లూ, ఉత్సవంగా బయలుదేరింది. ఆరోజున ఆ ఊళ్లో నాలుగువేల జనం సమకూడింది. అసలా ఊరి జనం ఐదారువందలమందికన్నా ఎక్కువ ఉండరు.

జనసమ్మర్దం ఎక్కువైయుంది. అల్లర్లు జరగకుండా రక్షకభటులుగా వాళ్లే వచ్చారు. ఈ జనం అంతా మర్యాదు

కొందరు ఆ మర్నాడు కొందర్నూ కాని వెళ్లరు. వీళ్లు వెళ్లిన తర్వాతకాని అసలు బండారం బయటపడదు. ఒక పేదసంసారం అయిన కొంపకు పదిమంది బంధువులు వచ్చి రెండురోజు లుండి పోతారనుకోండి. ఆ రెండురోజులూ పండగల్లె ఉం టుంది. బజ్జీలూ, పరమాన్నం, రెండు మూడు కూరలూ. మూడోరోజున వాళ్లు వెళ్లిపోయిన తర్వాత పదిహేనురోజులు ఆ యిల్లు చూడాలి! నిప్పచ్చరమై గింజుకొని చస్తారు. ఒక సామాన్యపు పల్లెటూళ్లో ఒక పెద్దసభ జరిగితే అంతే. జ్వరం రెండురోజులు కాచి వెళ్ళిపోయినట్లే ఆ విస్తారం చెప్పాలా?

ఈ జనం అంతా అడివిలో మైలుదూరందాకా ప్రథమ జట్టును సాగనంపారు. వెయ్యిమంది ప్రజ వెనక్కి తిరిగి వచ్చారు.

ఆ నలుగురు "రఘుపతి రాఘవ రాజారాం, పతిత పావన సీతారాం" అని పాడుకుంటూ అడివిలోకి వెళ్లారు. పులులు ఫలానాచోట ఉంటవి అని చెప్పిన గుర్తులు చూచుకొంటూ వెళ్లారు. పులు లెక్కడా కనిపించ లేదు. పులు లుండేడే నివాస స్థానం తెలిసింది. అక్కడ పులులు లేవు. ఒక లోయలో ఈ పులులఇల్లు; ఆ లోయ మొగదల వీళ్లు పగలంతా కూర్చు న్నారు. ప్రొద్దుగుంకిన తర్వాత యింటికి తిరిగివచ్చారు. ఏమయ్యా తిరిగివచ్చారంటే ఈ జనంయొక్క కేకలకు పులులు భయపడిపారిపోయిన వన్నారు. ఇది ప్రథమ దిన సత్యాగ్రహం.

# ౧౪

వెళ్ళిన జట్టు ఆ రాత్రికి తిరిగి చెదరకుండా చేరారు. చూడటంతోటే అందరూ అనుకున్నారు, ఇంకేముంది? సత్యాగ్రహం గెలిచింది. పులులు మనవాళ్ళజోలికి రాలేదు అని. జేజే ధ్వానాలతో వారికెదురు వెళ్ళారు. ఈ గోలలో వాళ్ళు 'ఒరే పులులు మాకు కనిపించలేదురా. అవి వేటకి వెళ్ళినవి కాబోలు; మేము ఊరికే పగల్లా గుహాలదగ్గర కూర్చొని చక్కా వచ్చేశాం.' అని చెప్పనిస్తేగా. జనం ఎగబడి గాంధీకి జై అని, వినోభావాకు జై అని, ఆ ప్రాంతీయుడు చరిత్రకారుడు శాస్త్రికి జై అని ఒకటే నినాదాలు. మరి ఆ వాలంటీర్లను భుజాలమీద ఎక్కించుకొని వాళ్ళు వద్దో బాబో అని యేడుస్తూంటే అరవటం, ఎగరటం, గంతులువేయటం, పరుగులుపెట్టటం. అది యొక పోతరాజు కొలువల్లే సాగించారు. ఇంక అరిచలేక వాళ్ళకే అలుపువచ్చింది. అప్పుడు జట్టువాళ్ళు చెప్పిన మాటలు వినిపించినవి. కొందరు పులులే కనిపించలేదా? అని నీరసంగా మాట్లాడటం మొదలెట్టారు. అందులో మరీ తెలివిగలవాళ్ళు అన్నారుగదా "అందులో విచారించవలసిన పనిలేదు. అసలు పులులు కనిపిస్తవా? సత్యాగ్రహం అనటంతోటే పారిపోయి ఉంటవి, వాటికి గుండెయా చెరువా! అవి ఇవ్వాళ గడ్డితిని ఉంటవి. ఇక వాటి ముఖానికి గడ్డే వ్రాసింది. సత్యాగ్రహాగ్నులు చెలరేగుతున్నవి" అన్నారు. అందులో

కొందరు పురాణాలు విన్నవాళ్ళున్నారు. వాళ్ళన్నారు "ఇదేం క్రొత్త విషయమా? పూర్వం ఋషులు తపస్సు చేస్తున్న ఆశ్రమాలలో పులులు లేళ్ళు నియ్యాలు పొందేవట, మా తాతయ్య చెప్పాడు. నీతిచంద్రికలో కథలన్నీ వినేను. లేకపోతే కాకికి లేడికి స్నేహ మేమిటి? చెప్పు? ఎలికకు లేడికి చుట్టరిక మేమిటి? చెప్పు?" ఈ పద్ధతిగా కొందరన్నారు. ఎంత అన్నా తెల్లా ఉన్న వాళ్లు కొద్దిమంది. తక్కినవాళ్ళందరికీ నిస్పృహ ఎక్కువైంది. ఇంతకుముందు వాళ్ల బుజాలమీద ఎక్కించుకొని గంతులువేసిన వాళ్ళల్లా "పోవోయి! తాటాకుల చప్పుళ్ళకు కుందేళ్లు బెదురుతవా?" వాళ్ల ముఖాలు చూడటానికి అనుకొన్నాము. పిల్లి వట్టి దద్దమ్మలని" అన్నారు. అనుకుంటే మీ మంప తెగా, మరి భుజాలమీద ఎందు కెక్కించుకొన్నారురా? అని అడిగే దిక్కు లేకపోయింది.

ఆ గందరగోళమంతా అయిపోయిన తర్వాత జట్టివాళ్లు వాళ్ల శిబిరానికి వెళ్లారు. అక్కడ కల్లో గంజో త్రాగి పడుకొని నిద్రపోయారు. మనునాడు ప్రొద్దున్నే మళ్ళీ బయల్దేరారు. వాళ్లు బయల్దేరేటప్పుడు వాళ్లవంకే చూచినవారు లేరు. మరి మూడురోజు లిట్లాగే గడిచింది. నాల్గోరోజున యేమైందంటే జట్టు నలుగురు వెళ్ళితే యింటి కిద్దరే వచ్చారు. తక్కిన వాళ్లేమైనారంటే 'పులులు వేసుకపోయినవి' అన్నారు. దాంతో ఊళ్లో మళ్ళీ వాళ్లమీద కొంత సరదా పుట్టింది. ఆ మనునాడు జట్టు బయల్దేరలేదు. అసలు ఇరవైమంది జట్టులలో యిద్దరు

పోస్తే ప్రపంచము జంతువులకే మిగిలాయి. శరీరంలో పెద్ద గందరగోళం పుట్టింది. పైకి కానరాకుండా—లోపల లోపలే జట్టులో ఇష్టాను ముష్టాలు కలబడటా—నికి పోతున్నాయి. అవియేమో మృగాలాయె. అందులో సగం మృగాలాయె—వాటికి జ్ఞానం లేదాయె ఆలోచనశక్తి లేదాయె. అడవిజంతువులకు ఆలోచన ఏదో విజ్ఞానంతో నాభిదగ్గరనుండి పుట్టుకొనివస్తుందా? అడవి జంతువులమాట అట్లా ఉంచు. మూర్ఖుణ్ణి ఎలా సంతోష పెడతాము? అందుకనే కదా "తిరిగి కుందేటి కొమ్ము సాధింపవచ్చు, చేరి మూర్ఖుల మనసు రంజింపరాదు" అని భర్తృహరి చెప్పాడు అన్నారు.

అందులో మరి ఒక బుద్ధిమంతుడన్నాడు. వాడు వాడి తెలివి వెనక్కి త్రొక్కి ఆవేశాన్ని పెంచుకొని వీళ్ళల్లో చేరినవాడు—వాడన్నాడుగదా: అసలీ సత్యాగ్రహసిద్ధాంతంలోపల ఉన్న దోషం చెప్తాను వినండి. ఈ దోషం ఒక్క సత్యాగ్రహ సిద్ధాంతంలోనే లేదు. ఆధునికమైన సర్వ నాగరికతలోనూ ఉన్నది. ఆధునిక నాగరికత పాశ్చాత్యదేశాలనుండి దిగుమతియైన వస్తువు—ఒక్క పరమ రహస్యం ఉన్నది—దానిని వదలిపెడ్తే ఆధునిక నాగరికత—దాన్ని నిగ్రహిస్తే ప్రాచ్య నాగరికత—ఆధునిక ప్రపంచంలో ఉన్న ప్రతి వ్యక్తిని బాగుచేస్తే అట్లాంటివాళ్ళందరూ కలిసిన యీలోకం దానియంతటదే బాగుపడుతుంది. కనుక విద్య వ్యక్తిని మనస్సులో పెట్టుకొని చెప్పాలి. సమూహాన్ని మనసులో పెట్టుకొని చెప్పకూడదు.

ఇల్లాంటివిద్యావైచే "మందిమీద మిరియాలు పిల్లటం" అంటారు. అంటే ఎవర్ని ఒల్లో ఎవళ్లకీ తెలియదు. ప్రతి వ్యక్తీ తన ధర్మమేమిటో తన స్థితి యేమిటో తెలిసికోవాలి. వాడు నీతిమంతుడౌతాడా? కాదా? వాడు ధర్మబుద్ధి ఔతాడా? కాదా? అన్న విషయం విచారించకుండా వాడెల్లా బ్రతుకుతాడు? వాడికి పెళ్ళెలా ఔతుంది! వాడెంత సంపాదిస్తాడు—అన్న ప్రశ్నలేమిటి? వాడు నీతిమంతుడు కాకపోతే, వాడు ధర్మబుద్ధి కాకపోతే వాడు బ్రతికినా ఒకటే చచ్చినా ఒకటే అని మన మంటున్నామా? రాజ్యాలుచేసేవాళ్ల ఉద్దేశ్యం ఇదేగా! హత్య చేశాడు, వాడిని ఉరితీశాడు. పెద్ద దొంగతనం చేశాడు. పదేండ్ల కఠినశిక్ష వేశాడు. దీని తాత్పర్యమేమిటి? నీతి లేని వాడు లోకంలో ఉండటానికి వీలులేదనేకదా ఉద్దేశ్యం?

అరె! యీ దొంగతనం చేసినవాడు నెలకు రెండువేలు సంపాదిస్తున్నాడు అని ఊరుకున్నారా? కనుక ఈ రాజ్యం చేసే వాళ్ళ వివేకం చూడండి. వాడికి నీతి ధర్మాలుపదేశించరు. వాడు నీతి ధర్మాలనుండి చెడితే శిక్షిస్తారు. నీతి ధర్మాలు వాటియంతట అవి పుట్టుకొనే వస్తవా? పుట్టుకొనేవస్తవందాము. మనం నాటని మొక్క మొలుస్తోందికదూ! అల్లాగే. కాని ఆ మొక్కకు నీళ్లుపోసి యెరువు వేసి పెంచితేనేగాని పెద్దదికాదు. అందుచేత నీతిధర్మాలు చిన్న వాడికి నేర్పాలి. మరొక డనవచ్చు, ఏమని అంటే? 'నీళ్లు పొయ్యకుండా ఎరువు పెట్టకుండా అడివిలో

ఎన్నో జబ్బులు పెరుగుతున్నవని ఒప్పుకుంటారు. నీ శాక్త్రప్రకారము లోకము బాగానే ఉంది; అడవివలె ఉంది. ఈ చెట్లనంటుచెయ్యక పనికివస్తవి. తలుపుచెక్కలకు పనికివస్తవి. తోటవలె నీకు ఫలసాయం లేవు. లోకం తోటవలె సర్వ దోషాలు ఆ రహస్యాన్ని గ్రహించలేకపోవటంమూలాన్నే వచ్చినవి. ఆ రహస్యం భారతదేశంలో ఉన్న పూర్వ ఋషులకే తెలుసు—ఇకను—నవాబ్లకు కెన్నాళ్ళకీ తెలియదు—వాడు పరమాధికారపు గోపురంమీద కూర్చున్నా సరే వాడు పూర్వ భారత ఋషుల యొక్క విజ్ఞానం తెలియనివాడైతే లక్షవిధాలుగా లోకాన్ని బాగుచేద్దామనుకొన్నా సరే కోటి విధాలుగా వానిచుట్టూ ఆపదలు మూగుతూంటవి—ఊడిన సీల వేస్తే యంత్రం సరిగా నడిచేటానికి ఒకచోట నూనె పోసి, మరొకచోట దుమ్ము తుడిచి మరి బాగా అంతకూ క్రొత్తరంగువేస్తే యేం లాభం? కొడుకు తండ్రిమాట వినలేదు—వాడి మనస్సులో తండ్రి దైవసమువంటివాడు. ఈ శరీరము అతనిమూలంగా ఉన్నది. అతని మాట వినకపోతే ధర్మము భ్రంశమౌతుంది అనే విషయం వానికి నచ్చచెప్పవలెనా? నా మాట వింటే నీకు ఏబది రూపాయలిస్తాను—నీకు బుష్కోటు కుట్టించిపెడతాను అనన్నా, నీవు నామాట వినకపోతే నీకీ పూట అన్నం పెట్టను—నీ వీపు పెట్లగొట్టతాను అనిన్నా చెప్పితే ఎక్కువ ఫలితం కనిపించదు—వాని మనస్సునే బాగుచెయ్యాలి—ఆ మనస్సునకు ధర్మబోధ చేయాలి.

ధర్మమంటే యేమిటంటే యేమి చేస్తే లోకం శాంతంగా ఉంటుందో అది. ఈమాట అందరూ చెప్పేదే. గాలిలో దీపం పెట్టడంనంటింది. 'లోకము శాంతంగా ఉండాలి' అని అననివా రెవరు? ఈలోకాన్ని శాంతపరిచేందుకు ఎన్ని సిద్ధాంతాలున్నవి కాదూ? ఈ సిద్ధాంతాలన్నీ యెందుకు పనిచేయటంలేదూ? ఆ సిద్ధాంతాలన్నిటియందు సన్నిహితమైయున్న దోష మేమిటంటే, అది ద్వివిధా ఉన్నది. దానికి రెండు పంగ లున్నవి.

ఒకటి సామూహికంగా తీసికొని విచారించటం. రెండవది లోకాన్ని లోకాన్నిబట్టి విచారించుట. మొదటి దోషాన్ని తొలగించవలెనంటే: లోకాన్ని సామూహికంగా చూడకూడదు. లోకమంటే అనేకమంది వ్యక్తులసమాహారం ఉండాలి. అడవివలె ఉండకూడదు. అందుచేత నీతి ధర్మాలు సాధించు. బ్రతకటానికి నీవు పడేంత శ్రమ పడవలెనుగదా? ఈ రెండు పంగలలో నిది మొదటి పంగ

రెండవది యేమిటంటే: ఆ నీతి ధర్మా లెట్లా ఉండాలి? అని. ఈ లోకాన్నిబట్టి సాగించాలి అనుకోటం ఎట్లాంటి దంటే? జోగిజోగి రాచుకుంటే బూడిద రాలింది అన్నట్లుంది. కలుషభూయిష్ఠమైన ఈ లోకానికి కలుషభూయిష్ఠమైన సూత్రాలే పట్టించినట్లు. పరలోకం ఒకటుందనుకో; పరలోకం అనటంతోటే సుఖాలు పోవుస్తావేమోయి? శాస్త్రజ్ఞానం

చేసినవాళ్ళన్న మాట. గణితశాస్త్రంలో ఒక్క నియతమైన వస్తువుయొక్క విలువ కనుక్కోవలసివస్తే ఒక లేని అంకమును సంకల్పించుకొని దానిమీద గణితంచేసి ఆ యదార్థమైన దాన్ని తెలుసుకొంటారు. అందుచేత నీవు ఊహింపతగినది అయిన పరలోకం ఉందనుకో, అప్పుడీ లోకంయొక్క నిజమైన విలువ నీవు కట్టగలవు. ఇది శాస్త్రీయమైన విషయమేగా! నీ యధునాతనమైన ప్రకృతిశాస్త్రం శాస్త్రం.

## ౧౫

అతడు మళ్లీ ఇట్లా చెప్పటం మొదలుపెట్టాడు. ధర్మమంటే యేమిటి? అని నిర్ణయించాలంటే చెప్పాను కదా ! పరలోకం ఉందనుకోవాలని – పరలోకం లేదనుకుంటే ఎన్ని యిబ్బందులున్నవో చెప్పటానికి వీలులేదు. పరలోకం లేదు. పూర్వజన్మలు లేవు. ఆ స్థితిలో లోకం ఎట్లా ఉంటుందో చూడండి. ఎల్లాఉంటుందో కాదు, ఎల్లాఉందో చూడండి. నీవు ఎన్ని విచిత్రపు సిద్ధాంతాలు పెట్టినా సర్వలోకంలో ఆర్థికసమానత్వంగాని తదితర విషయాలల్లో సమానత్వం గాని యేమీ చేయలేవు. తదితర విషయాల్లో ఎప్పుడు చేయలేవు. చూడు! హిందూదేశంలో పుట్టినవాళ్ళు తినే అన్నంలో సామ్యం తీసుకువస్తావా? దక్షిణదేశంలో వరిఅన్నం తింటారు. ఉత్తరదేశంలో గోధుమరొట్టెలు తింటారు. ఉత్తరధ్రువం దగ్గరనున్న మనుష్యులేమి తింటారు? అడవిలో ఉండేవాళ్ళు

నేమి తింటారు? వాళ్ళున్నా, కొన్ని జాతులున్నా అటపీ పర్యంతం ఏదైనా తింటారు. కోతుల్ని తినేవాళ్ళున్నారు. పాముల్ని తినేవాళ్ళున్నారు. అహా! ఏమి చెప్పాలి? అన్నం లోని సామ్యధర్మం? మరి నీ వంటావుగదా మేము కోరే సామ్యం ఇదికాదయ్యా, క్షుధాతురుడై యెవ్వడూ ఉండకూడ దని అంటావు. వాదనకి అట్లా అంటావు కాని, నీ వనేది యేమిటో చెప్పనా? నీవు నాగరక దేశా లనుకుంటున్నావే అవన్నీ నీ చేతి క్రింద ఉండాలని. మనస్సులో నీ సామ్యం ఇది. బయటకు నీవు చెప్పే సామ్యలక్షణం ఏమిటంటే అందరికీ జీవితంలో ఉండే అవకాశాలు సమానంగా ఉండాలని. అసలు నీకు సర్వజనులు సుఖపడాలని లేదు. ఉంటే ఆ సుఖంయొక్క స్వరూపం యేమిటో అసలు నీకు తెలియదు. ఉంటే ఏక దేశంలోఉన్న పరిస్థితులను తీసికొని దానినిబట్టి ఆలోచించిన వాడివే కాని సర్వమానవకోటిని గ్రహించినవాడవు కావు.

ఈ రీతిగా సర్వస్వామ్యం కావాలనేవాళ్ళల్లో కొందరికి ప్రధానం మిల్లు కూలీలు, కొందరికి రయితులు ఇల్లా వాళ్ళ వాళ్ళ యిష్టం కొద్దీ. అన్ని దేశాలలోను ఒక టేరకమైన పరి స్థితి లేదు. పాశ్చాత్య దేశాలు ప్రధానంగా మిల్లుల దేశా లయితే భారతదేశం ప్రధానంగా రైతుల దేశం. ప్రధా నంగా మిల్లుపనివాళ్లు, రైతులు వున్నారని తక్కిన వాళ్ళందరు ఊడ్చిపెట్టుకొని ఉప్పునీళ్ళు చల్లుకోపోరు. ఇన్నాళ్ళు నీవు చాలా భోగా లనుభవించావు.

గనా నిన్ను చంపేస్తున్నాను అని చంపేస్తే సామ్యం వచ్చిందా? కాదయ్యా నీ వనుకొన్న రాజ్యాంగం పెట్టు తాను. ఆ రాజ్యాంగానికి ఒక నియంత ఉంటాడు. అన్ని విషయాలకి అధికారులు కావాలి. మిల్లులో పనిచేసేవాడి కేమి కూలి యిస్తావో ఆ నియంతకుకూడ అదే కూలి యిస్తావా? వాళ్లు వాళ్లు చేసే పనినిబట్టి యిస్తానంటావు. అంటే నీ సామ్యం ఏమైంది? చేసే పనులలోనున్న యెగుడు దిగుడులను సరిపుచ్చలేవు గదా! వాడిశక్తిచేత వాడిని నియంతను చెయ్యను అంటావు. నియంతకావటానికి నలుగురైదుగురు సమానమైన శక్తిమంతులై ఉంటారు. ఈ నలుగురిలో ఒకడికే ఎక్కువ ఓట్లు వస్తవి. ఆ ఎక్కువ ఓట్లు రావటమే వాడి అధికశక్తి అంటావా? అది ప్రచారంలో ఉన్న సొగసు. ప్రచారం చెయ్యటంగూడ ఒక సొగసే అందాం. ఈ ఎక్కువ ఓట్లు వచ్చినవాడికి ప్రచారం చెయ్యటంలో ఎక్కువ శక్తి ఉన్నది. నియంతయైనతర్వాత దేశాన్ని చక్కగా పాలించటంలో తక్కినవాళ్ళకంటె తక్కువశక్తి ఉంది. ఎట్లా కుదురుస్తావు బాబా ఈ కథ?

'దీని కొక మార్గం ఉన్నది. మితిమీరకుండాఉన్న ప్రకృతిలో లోకాన్ని ఉన్నపాటుగా అంగీకరించాలి. సామాన్యమైన దోషాలకు వాణ్ణి ఉరితీయకు. వాడు నరహత్య చేస్తే ఉరితీస్తాను. అంతే, ఒక దోషంలో కోపం దపకరమైతే ఆ

దోషాన్ని నివారించాలి. (సామాన్యమైన దోషాలకు వాణ్ణి ఉరితీయరు, వాడు నరహత్య చేస్తే) భార్య ఇంట్లో కోడి గుడ్డుదీపంగ్లాసు పగులగొట్టిందనికూడా దానికి విడాకు లివ్వ గూడదు. మరి ఈ లోకంయొక్క స్వభావం ఏమిటంటే? ఇది సహితమై నిత్యంగా ఉండటమే. ఆ దోషములు తక్కు వగా ఉన్నపరిస్థితి చూచుకోవటంగాని సర్వదోషరహితంగా ఎప్పుడూ చేయలేవు. ఈ లోకము సర్వదోషరహితమైతే, సర్వజ్ఞానసహితమైతే ఇది మానవలోకమే కాదు. స్వర్గలోకము గూడా కాదు. ఇది వైకుంఠలోకమో! సత్యలోకమో! కైలా సమో ఔతుంది. ఆ లోకాల్లో మాత్రమే విరోధాలు, స్పర్థలు, స్వార్థాలు లేకుండా ఉంటారని మనపురాణాలు చెప్పుచున్నవి. ఈలోకంలో మాత్రము సర్వజ్ఞానులు ఎప్పుడూ పుట్టరు. అంటే అందరూ సర్వజ్ఞానులై పుట్టరన్నమాట. అందరు కామక్రోధాది దూషితబుద్ధులై యే ఉంటారు. అందు చేత లోకాన్నంతా పరమసుఖమయం చేద్దాము అనే రాజ్యాంగపథకం గాని, సర్వజనులు జ్ఞానులవలె ప్రవర్తించా లని ఉద్యమంగాని ఎప్పుడూ సంపూర్ణంగా ఫలించదు. వాటి ఫలితం ఎప్పుడూ దృశ్యాదృశ్యంగా ఉంటుంది. సత్యాగ్రహం అల్లాంటిది.

ఈ సత్యాగ్రహంయొక్క ఫలితం మందిసత్యాగ్రహం జరిగితేనేగాని కలుగదు. మంది అనటంతోటే పంచకోలకపా

యం—ఒకడు ఎగలీస్తే ఒకడు దిగత్రేస్తాడు. ఒకడు దెబ్బలుతిని నా కక్కరలేదు బాబో అని పారిపోతాడు. మరియొకడు ఖైదులోనుండి క్షమాపణయిచ్చి లేచివస్తాడు. ఖైదులో ఉండేటప్పుడు మరియొకడు దొంగచాటుగా అదీయిదీ తెప్పించుకొని ఇతరులకు లేని సదుపాయాలు కల్పించుకొంటూ ఉంటాడు. సత్యాగ్రహంచేసేవాళ్ళు ఇల్లాంటివాళ్ళా? విపడి మనస్సు కరగాలని • యీ సత్యాగ్రహంచేస్తున్నామో వా ఇల్లాంటివాడో కూడా విచారించాలి. ఇంగ్లీషువాళ్ళు రాజ్యం చేస్తూఉన్నప్పుడు సత్యాగ్రహంచేయటంలో కొంత న్యాయం ఉన్నది. ఎందుకంటే వాడు లోకాభిప్రాయమంటే వెరచే వాడు. ప్రజాభిప్రాయమంటే భయపడేవాడు. వాడు జ్ఞానవంతుడై కాదు. వాడిది ప్రజాస్వామికసిద్ధాంతం గనుక అమెరికాని కూడగట్టుకరావాలి. అందుకోసం ప్రజాభిప్రాయాన్ని మన్నిస్తాడు. అది సత్యాగ్రహఫలితంగాదు. వాడిమనస్సేమీ పరివర్తనపొందలేదు.

జాతకకథలలో ఒకకథ ఉంది. బుద్ధుని పూర్వజన్మల్లో ఒకజన్మలో బుద్ధుడు ఒక బ్రాహ్మణునికడుపున పుట్టాడు. చాలా చదువుకొన్నాడు. పెద్ద పండితుడైనాడు. ఒకరోజున రాజుగారి ఉద్యానవనంలోకి వెళ్ళాడు. రాజుగారు తన వందమంది భార్యలతో ఆ వనంలోకి విహరించటానికి • వచ్చాడు. రాజు రావటానికి ఆలస్యం అయింది. వందమందిభార్యలు ముందు

వచ్చారు. వాళ్ళకీ బుద్ధుడు శాంతము, అహింస బోధిస్తు న్నాడు. ఇతడు యౌవ్వనంలో ఉన్నాడు. మంచి అందగాడు, పండితుడు; రాజు వచ్చాడు. చూచాడు. అతనికి కోపం వచ్చింది. భార్యలనందరనూ పంపించి ఈ బుద్ధుణ్ణి శిక్షిం చాడు. ఇత డెంత సేపటికి అహింస అంటాడు. వాడు అహింస అన్నకొద్దీ బాధించాడు. చివర కా బుద్ధుణ్ణి చంపివేశాడు. ఈ కథలోఉన్న పరమార్థం ఏమిటి? అహింసా శాంతులు; అవి యెక్కడ ఫలవంతాలుకావో అక్కడ ప్రయోజనంలేదు. బోధిసత్వుడంతవాడి అహింసాసిద్ధాంతం ఆ రాజుదగ్గర నిష్ప్ర యోజనమైంది. ఆత్మనాశన హేతువైంది. అదీకాకుండా ఇది చూడు. దేనికి మనం సత్యాగ్రహంచేయాలి. మనం న్యాయంగా ఉన్నామా లేదా? ఈ రాతిని నేను ఎత్తబోతే అది లేవలేదు. అందుచేత అది లేచేవరకూ నేను అన్నోదక కాలు మాని ఇక్కడ సత్యాగ్రహంచేస్తాను. దీనికి యేమీ అర్థంలేదు. పూర్వంఎప్పుడో శివభక్తుడు శివలింగందగ్గర సత్యాగ్రహంచేస్తే స్వామి కనుపించాడని ఉంది. ఆ శివ భక్తుడు తెలివిగలవాడు. వాడు పరమేశ్వరరూపమైన శివ శక్తి అంతర్భూతంగా ఉన్న శివలింగమనే రాతిదగ్గర చేశాడు గాని, రోలుదగ్గర చేయలేదు.

కనుక ఇన్ని పేచీలతో కూడుకొన్నది ఈ లోకం. సవి మర్శంగా చూడాలి. పెద్దపులులమీద సత్యాగ్రహం ఏమి

హాయి! ఆ నెప్పోలియన్ ఎంత తెలివిగలవాడు; అతనిమాటలు విని నమ్మిన మనం ఎంత తెలివిగలవాళ్ళం!

ప్రశ్నించిన వెంటనే ఆ జట్టులో అందరూ అన్నారుగదా: సరే మనమే మందరం తెలివితక్కువవాళ్ళం. మేము వచ్చాము. తెలివిగలవాడవన్నావు; నీ వెందుకు వచ్చావు? అనిగువ్వకోలుగా అడిగారు. అతను సమాధానంచెప్పబోతే చెప్పనీయలేదు. అనటమే. పక్షి మూక. వాళ్ళు అరచి యరచీ అలుపువచ్చి ఊరుకొన్నతర్వాత ఆత డిట్లా సమాధానం చెప్పాడు. నిజమే, నేనూ తెలివితక్కువవాడినే. తెలివికూడా అనేకరకాలు. ఒక రు ఆలోచన మహా తెలివిగాచేస్తారు. ఆచరణదగ్గరకువచ్చేటప్పటికి వ్యామోహితులౌతారు. ఆలోచనయందు ఆచరణయందు కూడా వ్యామోహితులుకానివా డుండనేడుండడు. ఒకవేళ ఉన్నా ఆ ఆచరణ సర్వదానిర్దుష్టమౌతుందనటానికి వీలులేదు. ప్రకృతియందు బహుదోషములు సన్నిహితమై ఉంటవి. ఆచరణమార్గంలో ఏదోఒకస్థితిలో ఏదోఒకదశలో ప్రకృతిదోషం ఆవరిస్తుంది. ఆ ప్రకృతిదోషంతోపాటు మన ఆచరణదోషం ఆలోచనాదోషంకూడా కలిస్తే ఇంక చెప్పావు! ప్రకృతిదోషం ఏ వెప్పుడూ తొలగించలేరు. ఆచరణలో కొన్నిదోషాలు తొలగించవచ్చు, ఆలోచనమాత్రం నిర్దుష్టంగా చేయవచ్చు. చేసే వాళ్ళవిషయం సుమా! ఆ నిర్దుష్టంగాచేయటంకూడ ఆ చేసే వాడికి సంబంధించినంతమట్టుకు.

అంతో ఆ చేసినవాడు వాని పెంపకం, వాని నమ్మకం, వాని సన్నిహితాంశం. వాడుపుట్టిన దేశం, వాని విశ్వాసాలు, వాడి ప్రాతిపదికసంస్కారం. వీనితోపాటు ఇంకా ఈ పైన చెప్పినవాటి చేత సంబంధితమై ఉంటుంది. అవి అన్నీ నిర్ధారితమైతేనే నాకు కూడా నిర్దిష్టంగా ఊహిస్తే అది నిర్దిష్టమైన ఊహ.

౧౭

న్యాయశాస్త్రమూర్తే తర్కాలు పెరిగినకొద్దీ కొన్ని సందిగ్ధత ఏర్పడేటట్టు కన్పించింది. ఈ పని చెయ్యవచ్చునా? చెయ్యకూడదా? అని విచారణ మొదలుపెట్టితే నూటికి తొంభైసార్లు ఆ పని జరుగదు. మనవాళ్లు పూర్వం అన్నారు గదా, నీ కేదైనా ధర్మంచేయాలని ఊహ పుట్టితే వెంటనే చేయమన్నారు. ఆలోచించటం మొదలెడితే ఈ పని చేస్తే యీ యిబ్బందులున్నవి అనే ఊహ వస్తుంది. ఆ యిబ్బందులవల్ల వచ్చేబాధ గుణితముగా కనిపిస్తుంది. ఈ ఉద్దేశ్యాన్ని అనుసరించే 'అటునుంచి నరుక్కు-రా' అనేమాట పుట్టింది. వెనుక ఒకటికి దొంగలు చెలరేగితే వారిరెడ్డి వెంకటాద్రినాయుడుగారు వందమందిని వరసగా నిల్చోబెట్టి తానే కత్తిపుచ్చుకొని బయలుదేరాడట. ఒకడిదగ్గర మొదలుపెట్టబోతూంటే వాడన్నాడు 'అటునుంచి నరుక్కురా' అని, తనదాకా వచ్చేటప్పటికి కొంత పశ్చాత్తాపం పుట్టదా? అని. కాని, ఆయనమాత్రం వాడినికూడా వదలిపెట్టకుండానే నరికాడట. ఇది నిజంగాజరిగింది.

కాని కొంతకాలం గడిచేటప్పటికి ఒకపనిచేద్దామన్న మొదటి నిశ్చయంలోని (శద్ధను నిస్సందేహంగా సడలుతోంది అందులో ఆ చేయదలచిన కార్యంలోపలనున్న యాథార్థ్యమూ, తత్త్వమూ అనిశ్చితఫలాలైతే అప్పుడు మరీను. మరి యీ సత్యాగ్రహం నిజంగా అనిశ్చితఫలంగా కనిపిస్తోంది. అవతలవి పెద్దపులులు కావటం, ఇవి జంతువులు కానటం. వాటికి ఊహ లేకపోవటం, మనస్సే లేకపోనటం. వాటిలో జ్ఞానోదయం కలిగిద్దామన్న ప్రయత్న మేమిటి? ఇట్లాంటే ఆ జట్టులో ఒక డన్నాడుకదా! 'మేము జ్ఞానోదయంకలిగించటానికే ప్రయత్నం చేయటం లేదు. వాటిలో అనురాగోదయం కలిగించటానికి ప్రయత్నిస్తున్నాం. అనురాగమనేది జంతువుల్లోనూ ఉంటుంది. పెద్దపులికి యిది మాత్రం. వాటికి పెళ్ళాలు, పిల్లలూమాత్రం లేరా? వాళ్ళను కరుస్తోందా? ప్రేమగా చూడటంలేదా? అందు చేత ప్రేమఅనేవస్తువు అది అత్యంతాభావమైనవస్తువు గాదు. ఆ ఉన్నవస్తువుని వృద్ధిపొందించటం చేయాలి'. మరొక డన్నాడు "కాదయ్యా వృద్ధిపొందటం అనేకవిధాలుగా పొందుతుంది. జ్ఞానోదయంకలిగీ పొందవచ్చు. శరీరంలో శక్తి ఉడిగీ పొంద వచ్చు. తతాకాలమైన తృప్తికలిగీ పొందవచ్చు. అనుకొన్న ఫలితం కలగకపోతే పొందవచ్చు. వైరాగ్యోదయం ఎన్ని విధాల కలుగుతుందో అన్నివిధాలా సన్యాస్తుకి అభ్యుదయం కలగవచ్చు.

మరియొకాయన అన్నాడు "ఇదంతా వైష్ణవమత మేనాయె; ప్రేమ సన్న్యస్తనేమిటి! ప్రేమే భగవంతుడంటారు వాళ్ళు. ఇంద్రియములయొక్క ఉపరతి జరిగితేనేగాని సన్న్యాస మనేది ఉదయించదు. ప్రేమ అనటంలోనే ఇంద్రియములు వానివిషయములపట్ల అనురాగం, వానియందలి అభివ్యక్తి సంబంధమైన ఒకఆర్ద్రత సంభవించినట్టు భ్రాంతి. ఈ రెండూ ఒకటి ఉత్తరధ్రువం, రెండవది దక్షిణధ్రువం".

మరి యింకొకాయన అన్నాడు "ఈ ప్రేమ అనేది భగవంతుడు కాకపోవచ్చు. దానిదగ్గరకు దారితీసేవిషయం మాత్రం తప్పకుండా అవును. నీవు పరమార్థాన్ని ఆక్షేపించ నక్కరలేదు. మన వైష్ణవమత మేమిటి? అద్వైతవ్యాసిమత మేమిటి? నీ భాగవతంలో దశమస్కంధమంతా యేమిటి? తిరుప్పాణాళ్వారువారి "తిరువాయిమొళి" యేమిటి? పరమేశ్వరుడు భర్త. భక్తుడు భార్య. ఈ ప్రేమ పరమేశ్వరసన్నిధానాన్ని చేరుస్తుందనేకదా! నీ వన్నట్లుగా ప్రేమ సొంతంతటది సద్వస్తువు కాకపోవచ్చు. దానియందు సద్వస్తుప్రాపకతాగుణమైన ఉందిగా" అని. మొదటాయన అన్నాడు—"దానియందు సద్వస్తుప్రాపకతాగుణం ఉంది అందాం; ఎప్పుడుంది? సద్వస్తుభావాభిముఖంగా ప్రసరిస్తే ఉంది. సద్వస్తుభావనయే లేకపోతే యెట్లా ఉంటుంది?" అని. రెండవఆయన అన్నాడు "ఆ భావనకలిగించడానికి మా ప్రయత్నం" అని.

[illegible]ంపుతున్నా, ఆ భావన యెట్లా కలిగిస్తావు? ఎవరికి కలిగిస్తావు? ఆ భావన కలగడానికి వీలైన సంస్కారాన్ని సమయం పరిస్థితులు ఉన్నచోట కలిగించగలవు. ఇప్పుడు ఆ మహాత్మ జగదీశచంద్రబోసు ఉన్నాడు. మన పూర్వఋషులందరూ అంతర్దృష్టులై చూచిన మహావిషయం వృక్షాదులు కూడ ప్రాణసంభృతములు అనేదాన్ని ఈ అధునాతనమైన మృణ్మయమైన బుద్ధి గలిగిన పాశ్చాత్య పదార్థబుద్ధిజనితనాగరికతా వికారాలకు కానుక ప్రయోగరీత్యా చూపించాడు. ఒప్పుకున్నాం. ఆ వృక్షగతమైన ప్రాణమును ప్రబోధంచేసి మనుష్య శరీరగత ప్రాణమువలె దానికి మనస్సు, బుద్ధి, అహంకారం, ఇంద్రియములు. విషయములు మొదలైన శాఖోపశాఖలుగా పెరిగేటట్లుగా వృద్ధిపొందేటట్లుగా చెయ్యటానికి వీలౌతుందా; ప్రాణమునందే సత్యంగా ఇవన్నీ సుప్తావస్థలో ఉంటవి, అందాం. వృక్షమనే ఉపాధిలో ఈ మనోబుద్ధ్యాదులకు ప్రబోధము కలగదు" అనే నేను చెప్పేది. ఆ ఉపాధికి ఆ శక్తి లేదు. అట్లాగే ఈ పులులలో ఉన్న దారపుత్రాదులయందలి ప్రేమ పట్టి ముడిచినస్తువు. దానిమీదిపొట్టు దంచటానికే పది వేలరోకళ్లు చాలవు. దానిని ప్రబుద్ధంచేస్తానంటావేమిటి? చేస్తానటంచేత నీవు ప్రబుద్ధుడవవుతున్నావు.

ఎంత తర్కాలు పెరిగినా మనవాడినోరు పెద్దది. అందుచేత మనవాడే గెలిచినట్లు కనుపిస్తుంది. అతని నంటాడు, వాదిని సమాధానం. తక్కినవా ళ్ళంటారు. వాదనకి యదా

ర్థ్యానికీ సంబంధం లేదంటారు. అంటే మనసా వాక్కూ అందవుగదా, ఇది చేతగాని ఇంగ్లీషువాళ్ళ నేమాట. నీవు అది పట్టుకొని దేవులాడుతున్నావు. నీకు, నీకీమాట చెప్పినవాళ్ళకూ కూడా దాని అర్థం సరిగా తెలియలేదు. వాదానికి యదార్థ్యానికి కాదు సంబంధం లేకపోవటం—వాదము చేతనే యదార్థ్యం గోచరిస్తుంది. యదార్థనిర్ణయం వాదం చేతనే జరుగుతుంది. ఇంకోవిధంగా జరగనేజరగదు. మరి యీ మాటలో రహస్య మేమిటో చెప్తాను విను. పరమేశ్వరుడు వాగతీతు డంటారే అది రహస్యం. పరమేశ్వరుడిసంగతి అనుభూతిచేత తెలిసికోతగింది. అంటే నీ వది అనుభవించవలసిన దే, నోటితో అది యిదమిత్థమని చెప్పలేము. నిన్ని తీసుకోవెళ్ళి తాతజుట్టుకు, నాకాళ్ళకు ముడిపెట్టను.

తక్కినవాళ్ళందరకూ ఈతనిమీద కోపం వచ్చింది. పైకందరు ఇతనివాదనను తిట్టేవాళ్ళే. లోపల అందరూ ఈతనివాదన నిజమని అనుకొని ఈ సత్యాగ్రహం వృథా అనుకొనేవాళ్ళే.

ఇట్లా నానాపేరులు అయిన ఈ జట్టులో గంగినీ డేం చేస్తాడు? ఆ గంగినీడికి ప్రాణాలు కడపట్టుతున్నవి. పిల్లందరినీ ఒకకట్టుకొయ్యకు తీసుకొనిరావటానికి సాధ్యం కావటం లేదు. ఇల్లాంటిపనులు ఒక్క ఆవేశంలో చేయరాదు. ఒకటోపులో చేయాలి. ఈ లోపల నేను దాకగలుగుదునా? లేదా? అనే

పుస్తె వేసుకొన్నావనుకో. అసలు సతంగా నీకు దూకగలిగినా తప్పకుండా బోడెబోపడదే. ఉపసంహరించండా దూకు, నిజంగా బోడెదూకేశక్తి నీకు లేకపోయినా ఒక్కొక్కప్పుడు దూకేస్తారు.

అందుచేత గంగిసీడు ఏంచేయాలసివచ్చింది? పిల్లందరికీ ఆవేశంపుట్టించవలసివచ్చింది. మనకు స్వరాజ్యం రాకపూర్వం కాంగ్రెసువాళ్ళు ఉపన్యాసాలకు మల్లె తల్లాతోకా లేకుండా ఊగేసే డబడబం కట్టివేయటం. ఇప్పుడు ప్రచారంలో ఉన్న లక్షసిద్ధాంతాలకుమల్లె వాటినిగురించి ఓహో కొట్టిపొయ్యటం. దున్నపోతు ఈనిందిరా దూడను కట్టివేయమనటం కాదు. ఒకదూడను చూపించి దీనిని దున్నపోతు ఈనిందనటం. దున్నపోతు ఎట్లా ఈనుతుంది? అని అడిగితే, ఒరేయి దూడ కన్పిస్తోంటే ఆ ప్రశ్న ఏమిటోయి అని వేళాకోళంచేయటం. ఓరి నీదుంప తెగ, ఈ దూడ వాళ్ళదూడరా. దాన్ని మనచేత మేపించేందుకు మనగేదె లేదు గనక మన దున్నపోతు ఈనిందంటాడు. నీ మనస్సులో "మన కొక గేదె ఉంటే బాగుండును. ఆ దూడను పెట్టితే బాగుండును" అని ఉంది. దూడ కావలసి వచ్చాలునని నీ యేడుపు. తారకు చంద్రుడికి బుధుడు పుట్టితే బృహస్పతి తనకొడుకని యేడ్చినట్లుంది ఇది; అందుచేత నీ కావేశం ఎక్కించి తనపని తను చేసుకొంటాడు!

అదేమిటయ్యా! దేశక్షేమం ప్రత్యక్షంగా కనుపిస్తుంటే పిల్లలు ఉంటారు ఉంటారేమో! ఓయిబాబూ, నీకు ప్రత్యక్షంగా

కనుపించే ఆ దేశక్షేమం ఏమిటో చెప్పు. మన కింకొక ఉదా హరణ యెందుకు. ఈ పులులవిషయమే చూద్దాం. ఈ పులు లను వేటాడి, యెక్కడుండితే అక్కడ నరికిపారవేస్తే పోదా? దానికి సత్యాగ్రహం ఎందుకు? ఆ పులులను నరికివేయటానికి అభ్యంతరం యేమిటి? యింతవరకూ ఆ ప్రజలమీద పైఉద్యో గస్థులందరికీ ఉన్న దొబ్బుడాయి యేగదా! వాళ్ళందరినీ యెందుకు శిక్షించవు? మరెట్లాగ వాళ్ళయితే మీకు పాము చుట్టము, పడగ పగ. గంగిసీడికి సంప్రయోజనం? అంటారు. ఈకాలానికి తానొక మహార్షన్లే ఉండటమే ప్రయోజనం. మీకు లౌకికమైనప్రయోజనం, ప్రయోజనమల్లే కనిపిస్తుంది. మానసికమైన ఒక నైరిమార్గం అందులో ఒకఆదర్శం ఉన్నట్లు కన్పిస్తుంది.

౧౭

సామాన్యంగా సేనానాయకు లట్లాగే దేశనాయకు లని పేరుపెట్టుకున్న ఉద్యమనాయకులు అట్లాగే. యుద్ధాలకు బయల్దేరతారు. బయల్దేరే దెవరు? వట్టి సైన్యాలు? పిల్లందరూ తినటానికి తిండిలేక, చదువుకొన్న చదువు లేక వట్టి అప్పుడు ఆగమ్యకాకులవలె తిరుగుతు యుద్ధంవచ్చిందేచాలురా, యుద్ధం జరిగినన్నాళ్లు సుఖంగా బ్రతకవచ్చు అనుకొంటారు. యుద్ధాలు రావలెననుకొనేవాళ్ళిద్దరే. మొదటివాళ్లు వర్తకులు, రెండవ వాళ్లు సామాన్యసైనికులు. వీళ్ళిద్దరిమధ్య ఒకటే భేదం.

మాట వినటం. అంటే అబ్బాయి, మనబట్టలన్నీ గుంపుగా బాబాయికి వేయాలంటే వేయటమే. నోరంటే నోరు వెనక మనస్సు ఉండాలి. బుద్ధి ఉండాలి. చదువు ఉండాలి. ఇవి ఏమీ కావు. నోరు అంటే పత్రిరోరే. మరి నోరు కావలిస్తే ఆ మాట కెదిరించి నీ పీకల్లో ఉంటావా అనటం.

"ఊరుండటమంటే మరికొంచెం చెప్తాను. ఈ దేశంలో ఉన్న ఊళ్ళన్నీ పూర్వమెప్పుడో మనదేశంలో ఉన్న సంఘవ్యవస్థను బట్టి యేర్పాటైన ఊళ్ళు. అగ్రహారమైతే బ్రాహ్మణయిళ్లు ఎక్కువ ఉంటవి. రైతువారీ ఊరైతే రైతుపాలాలవారియిళ్ళెక్కువ ఉంటవి. ముఖాసా గ్రామమైతే ఆ జమీందారు బంధువులైనవాళ్ళ యిళ్ళెక్కువ ఉంటవి. కుండలుచేసేవాళ్ళు, క్షౌరంచేసేవాళ్ళు, గుడ్డలుతికేవాళ్ళు, బండిచక్రాలు నాగళ్లకు మేడికోళ్ళు చేసేవాళ్ళయిళ్ళు ఒకటిరెండుంటవి. బంగారపుపని చేసేవాడియిల్లు ఒకటే ఉంటుంది. సరకులమ్మేవాళ్ళయిళ్ళు మహాఉంటే నాలుగైదుంటవి. బట్టలునేసేవాళ్ళ యిళ్ళు ఒకటో రెండో ఉంటవి. ఇంతకంటె ఎక్కువ ఉంటే వాళ్ళ వృత్తులు జరుగవు. చూశారా! గ్రామనిర్మాణపద్ధతి. ఊరుండటమంటే ఊళ్లో ఎక్కువ తనకులంవాళ్ళ యిళ్లుండాలి. వాళ్ళకేగా ఊరున్నట్లు. కనుక యేమౌతోంది. రైతువారీ కుగ్రాలవాళ్ళకీ అడపాదడపా అగ్రహారీదార్లకీ వీళ్ళకు మాత్రం ఊరున్నట్లు లెక్క. ఒకకులంవాళ్ళకంటే ఎక్కువ ఉన్నారంటే ఆ వృత్తి చేసేవాళ్లు పూర్వకాలంలో యెక్కువమంది ఉండాలిసిన అవ

సరం ఉంపినన్నమాట. పూర్వకాలంలో ఏమిటి? యిప్పుడేమిటి, పాలించుసన్నవాళ్ళసంఖ్య ఎప్పుడూ ఎక్కువగానే యుంటుంది. సంఘంలో పాలించున్నవా శ్లెంతమంది కావాలో, క్షౌరం చేసేవా ళ్ళెంతమందీ యెప్పుడూ అవసరంలేదు. బంగారపు పనిచేసేవా శ్లెప్పుడూ తక్కువగానే యుంటారు కనుక వృత్తిని బట్టి సెలలాలు నిర్ణయమైతే ఉన్నపరిస్థితి సంఘబలానికి ప్రాధాన్యంవచ్చినపరిస్థితిగా మారితే దయ్యాలకు మోకాళ్ళు వెనక్కి, మోచేతులు ముందుకు ఉంటవట అట్లా ఉంటుంది.

సరే, అదంతా మన కెందుకు? మనగంగినీడు మంద బలంకలిగినసంఘంలోవాడు. సంఘంలో వాడు; కులంలో వాడు. ఒకసారి సబర్మతీ ఆశ్రమానికికూడా వెళ్ళివచ్చాడేమో తెలియదు. ఆయన నాయకుడు కాకుండా ఎట్లావుంటాడు. ఆయనకువచ్చినలోపం ఒకటే. ఆయన పూర్వం ఇట్లాంటి జట్టులను నడపలేదు. మరి అదికాక మరీ పెద్దలోపం ఒక్కటుంది. పూర్వచరిత్రలు అందులో మరీ రాజస్థానకథలు చదివాడు పాపం. పూర్వం ఆ సేనానాయకులు, రాజులు యుద్ధంలోకి ముందర మూకేవాళ్లు. వాళ్లు సేనాగ్రయాయులు. వాడు చచ్చిపోతే సేన ఓడిపోయినట్లు. అది పూర్వయుద్ధం. ఇప్పటి యుద్ధాలు అట్లా కాదే. సేనలన్నీ చచ్చినా సరే సేనానాయకుడు చావడు. సేనలన్నీ ఓడిపోయినాసరే రాజు ఓడడు. వాడూ చప్పున ఇంగ్లండుకు వెడతాడు. వాడక్కడ ఒక తోలుబొమ్మల రాజ్యం పెట్టుకొంటాడు. పాప మా గంగినీడుక్కు ఈ క్రొత్తలన్నీ

ఠం తెలియదు. ఎప్పుడైతే తనజట్టువాళ్లందరూ వెనక్కితీశారో తానే నడుపుతానన్నాడు. ఇది పెద్దపులులతో వ్యవహారమాయె. పట్టి సత్యాగ్రహమైనా బాగుండేది. పోలీసువాళ్లు వీడిని తీసుకునివెళ్లి జైలులో పెట్టేవాళ్లు. తక్కినవాళ్ళ వీపులమీద తలలమీద కఱ్ఱలుతిరిగేవి. జైలులో ఇతడు చక్కగా రాజబంధువల్లే ఉండేవాడు. మొదటితరగతివాడు మరి వాడికి నంబరు కూడా ఉండదు.

సరే బయల్దేరాడు గంగినీడు. బయల్దేరటంలోనే సేనానాయకుడే బయల్దేరితే సేన బయల్దేరకపోవటం చాలా తప్పు కదా. వారం పదిరోజులమట్టి చేస్తున్న తర్కాలన్నీ దాచేసి, ఇరవై మంది బయలుదేరారు. గంగినీడన్నాడు "ఇవేళ నలుగురమే వెళ్ళాలి. మీరందరూ మిగలండి. నాతో మరి ముగ్గురుమాత్రమే రండి. అందరికీ ఆవేశాలు పెరిగినవి. గంగినీడు ఏమైనాసరే బయలుదేరకూడదన్నారు. ఆయన్ని బ్రతిమాలి బామాలి గౌరవంచేసి పొగడి ఎట్లాగైతేనేం, ఆయన కాకుండా నలుగురూ బయలుదేరేపద్ధాటు జరిగింది. మరి సేనానాయకుడు బయలుదేరితే యెట్లాగా? వ్యూహారచన ఎవరు చేస్తారు? అంత యుద్ధనీతి మరి యెవరికి తెలుసు? మళ్లీ బయలుదేరేటప్పటికి హారతులు బాజాలు అన్నీ సాగినవి.

ఈసారి గంగినీడు జట్టువాళ్ళందరినీ నిల్చోబెట్టి— ఊళ్లో అందరూ అక్కడ ఆదివరకే సమావేశమైఉన్నారు— సత్యాగ్రహరహస్యాన్ని గురించి ఒక ఉపన్యాసం యిచ్చాడు.

"పులులు అక్కడ వుండవనికాని వుంటే అవి బుమ్మల్ని తినవనికాని మీరనుకోకూడదు. మనము యుద్ధవీరులము. ఇది శాంతియుద్ధము. మనశాంతియే మనఖడ్గము. మన ఓర్పే మన ఫిరంగి. మన పట్టుదలే మన తుపాకి. 'హత్వావా ప్రాప్స్యసే స్వర్గం, జిత్వావా భోక్ష్యసే మహీం' ఈ శ్లోకార్థం గంగిరెడ్డు తప్పుగా చదివాడు. ఏం తప్పుచదివాడో జ్ఞాపకంలేదు. అందుచేత తప్పులులేకుండా వ్రాశాము 'ప్రాప్స్యసే భోక్ష్యసే'లు 'పరావ్ఛాసే భోచ్ఛసే'లుగా చదివినట్లుగా జ్ఞాపకం. పైగా ఆయనే రైటేమో! మేమే తప్పేమో! ఆయన శౌరసేనియో మాగధియో పైశాచియో మాట్లాడుతుంటే నేను సంస్కృత మనుకున్నానేమో! మహీం అంటే భూమిని మనం గెలిస్తే అనుభవించగలము అని అన్నాడనుకోండి. భూమిని అనుభవించడమేమిటి? వీళ్లు ఏరాజ్యంకోసం యుద్ధంచేయటంలేదే. పులులు వీళ్ళనుచంపి తినకుండాఉంటే నాలుగుకాలాలపాటు బలుసాకు తిని బ్రతుకవచ్చుగా అని అర్థమైఉంటుంది అనుకొందాం. మళ్లీ ఆయన ఇల్లా మొదలుపెట్టాడు— "ఇది మహాత్ముడు కనిపెట్టిన మహాస్త్రం. దీనికి తిరుగులేదు. స్వాతంత్ర్యరథం వెళ్లుతుంటే, అది జగన్నాథునిరథం వంటిది. చక్రాలక్రింద బడి అనేకులు నలిగిపోతారు. ఈ యుద్ధంలో మరణించినవారికి స్వర్గం వస్తుంది. మనపూర్వు లేం చెప్పారు? యజ్ఞయాగాది క్రతువులు చేసినవాళ్ళకి యుద్ధంలో మరణించినవాళ్ళకి స్వర్గలోకం వస్తుందని చెప్పారు. రంభోర్వశీ ప్రముఖ దేవకాంతల

సంభోగం కలుగుతుంది. మనం పాశ్చాత్యులకువలె వట్టి పాదార్థికనాగరికత కలవాళ్ళంకాదు. మన నాగరికత ఆధ్యాత్మికం. (ఇక్కడ ఒక మాట చెప్పాలి. ఈగంగినీడు పూర్వం—పూర్వ మేమిటి? అవసరమైతే యిప్పుడుకూడా స్వర్గాలు లేవని, ఇదంతా కొందరి అభూతకల్పన అని వాదించినవాడే. యజ్ఞయాగాదిక్రతువులు చేయటం పశుహింసచేయటమని ప్రచారం చేసినవాడే. అదంతా గడచిపోయిన నాగరికత. అప్పుడు మనుష్యు లందరూ అజ్ఞానస్థితిలో ఉన్నారు. ప్రపంచకం సాగిపోతున్నకొద్దీ నాగరికత హెచ్చిపోతున్నది. పశుహింస చేయుటం చాల తప్పు అని చెప్పినవాడే. చెప్పటమేకాదు, ఒక ఊళ్లో ఒకాయన యజ్ఞం చేస్తూంటే ఈ గంగినీడు ముఠావాళ్ల భూతదయాగుణప్రభావం వలన ఆ యజ్ఞం ఆగిపోయింది. మరి యివ్వేళ యిక్కడ యిట్లా యెందుకు చెప్పాడంటారా! ఇక్కడ ఇట్లా చెప్పితేనేగాని వాళ్ళకి ఆవేశం పుట్టదుగనుక) ఇల్లా ఆయన ఉపన్యాసం అయిపోయిన తర్వాత మొదట నలుగురిజట్టూ బయలుదేరి వెళ్ళారు.

ఆ రాత్రి ఆ నలుగురు తిరిగి రాలేదు. మర్నాడు ప్రొద్దున్నే వాళ్ళను వెదకటానికి వెళ్లారు. ఆ పులుల గుహ ముందు పులులు కూర్చుని వాళ్ళని భోజనంచేస్తున్నవి. వెళ్లినవాళ్లు దూరదూరంగా చెట్లమీదనుంచి పారిపోయి వచ్చారు.

రెండురోజులయిన తర్వాత మళ్లీ నలుగురు బయలుదేరారు. వాళ్లు తిరిగిరాలేదు. అసలు ఏంజరిగిందంటే? పాపం

పసలు పసం నేటూ పట్టుకుంటుకు! అన్నం కోసం వెతుక్కోటం ఎందుకు! మాంసం కోసం వాళ్లే వస్తున్నారట అని పులులకు తెలిసింది. అన్నికుటుంబాలు ఒక్కచోటనే చేరినవి. రెండు రెండు రోజులకొకమారుగా ఐదుజట్లు వెళ్లినవి. పులులు యిరవై మందిని ఫలహారం చేసినవి. దేశంలో ఆవేశం ఎక్కువైంది. దేశంలో వాలంటీరులు తండాలు తండాలుగా వస్తున్నారు. పదిసు నెలలు గడచింది. సుమారు రెండువందలమంది చచ్చారు. మరి రెండువందలమంది గాయాలతో వుండి చికిత్సలు చేయించుకొంటున్నారు.

౧౮

శతముండి సహస్రముండి అన్నట్టుగా ఉంది వ్యవహారం. జట్లు జట్లుగా వాలంటీర్లు వెళ్లుతూనే ఉన్నారు. తెట్టెలు తెట్టెలుగా పులులు వాళ్ళని తింటూనే ఉన్నవి. నెల్లాళ్లు గడచేటప్పటికి అడవిలో ఉన్న క్రూరజంతువులకు ఒక సత్రయాగం జరుగుతూన్నట్టనిపించింది. నెలకు వెయ్యి రెండు వేలు వచ్చేవాళ్లకుకూడా అంత రాజభోగం జరగదు. వందెకరాల పొలంగలవాడికీ జరగదు. జమీందార్లకైనా జరగదు.

అదృష్టం బయటపడటమే తప్ప అంత భేదమూ లేదు. వాటికేమీ, పగలల్లా గుహాలో నిద్రిస్తవి. పులులు ఈ వాలంటీర్లను చంపుతవి. ఆ చంపటంకూడా వాటికి అదొక క్రీడ అయింది.

చంపాలా? చంపకూడదా అన్న వితర్కం కూడా వాటికి బయలుదేరింది. వితర్కం బయల్దేరింది అని అనుకోటం ఎట్లాగు? అంటే ఇదివరకు వీళ్ళను చూడటంతోటే గాండ్రుమని మీదపడేవి. ఇప్పుడు మాట్లాడకుండా ఊరుకుంటున్నవి. మళ్ళీ ఇష్టంవచ్చినప్పుడు తినవచ్చులే అని ఊరుకుంటున్నవేమో!

మొట్టమొదట ఏదో చిన్నపులో జోక్యం కలిగించుకొంటేనేగాని పెద్దవి మీద పడటంలేదు.

రోజువిడిచి రోజు నలుగురు వాలంటీర్లు వస్తారు. పరవాన్నమేననుకోండి, రోజూ తింటే మొగం మొత్తిపోదూ! వాటికి విసుగు వేసింది.

విసుగైతే మాత్రమేమి, ఆకలి మానుతుందా? ఇంక తోడేళ్లు, చిరతపులులు, కొరనాసిగండ్లు, సివంగులు వాటి జన్మలో మనుష్యమాంసము తినే భోగం ఎరుగవు. వాటిగీత బైటపడ్డది. అవి మధ్యమధ్య వచ్చి కొంచెం రుచిచూచిపోతూంటవి.

ధనవంతుల యిండ్లలో పరవాన్నాలు, లడ్లు, గారెలు, సేమ్యాలు చేసి సంతర్పణ చేసుకున్న తర్వాత విస్తళ్లు పారవేస్తే యేనాదివాళ్లు పాకీవాళ్లు వాళ్ళజన్మలో ఎన్నడూ ఎరుగని ఆ పాకాలరుచి చూస్తారుగదూ. అల్లాగే చిరతపులులు మొదలైనవాటికి ఈ రుచి తెలిసింది.

వేటకాళ్ళంటారుగదూ! చిరతపులులూ అడవికి పాకీవాళ్లవంటివి అని. అంటే! మహాత్ముగారు ఏ జంతువునో చంపి

తిన్నంత తిని వదలిపెట్టిపోతవి. ఆ మిగిలినజంతువు మురిగి [illegible] అంతా కంపుగొడుతుంది. ఆ జంతువుని మహామృగాలు తినవు. చిన్నప్రాణులు తోడేళ్లు మొదలైన జంతువులు తింటవి. అందువల్లని పాటికా పేరు వచ్చింది. అందుకనే యీ గోస్పతింకి రుచికారకా కలగడానికి వీలుకలిగింది.

ఇక ఉత్సాహం ఎల్లావుంది? అంటే? ఆ నలుగురూ బయల్దేర [illegible].

చచ్చినవాళ్ళకీ వీళ్ళకీ ఒకటే భేదం. ఎవడైనా చస్తే నానుపుబద్దలు, క్రొత్త గుడ్డలు, కుండలు, బ్రాహ్మణుడు ఈ హంగామా అంతా కావాలి. కొట్టుపుల్లలు కావాలి. ఏ పాతికో ముప్పయో చేతిలో పుచ్చుకుంటేనేకాని ఆ కథ తేలదు.

వీళ్లకి ఏ ఖర్చు లేకుండా ఉత్తరాదికి వెళ్లుతున్నారు. ప్రతి రెండురోజులకి ప్రపంచకపు లెక్కల్లో వందరూపాయలు ఆదా కనిపిస్తున్నది. నలుగురికి నాలుగు పాతికలు.

'ఈ సత్యాగ్రహం చిరకాలం వర్ధిల్లుగాక; ప్రపంచము యొక్క ఆర్థికపులెక్కలకు కొంత బరువు తగ్గుతుంది అనుకోవచ్చు' అని ఒక వాలంటీరు ఛలోక్తిగా అన్నాడు.

ఆ దేమిటయ్యా చచ్చేవాళ్ళకి ఛలోక్తి ఏమిటి? అంటే "చచ్చేవాడికే ఛలోక్తి" అన్నారు. ఎట్లాగూ చస్తాం, సరదాగా చస్తే మంచిది. సౌఖ్యలోకాలు వస్తవి. ఏ భావనతో చస్తే ఆ లోకాలు వస్తవని భగవంతుడు భగవద్గీతలో చెప్పాడుగదా;

ప్రసితత్వం గాక గాని వాస్త్వం కాదుగా! అందుచేత ఆ వెళ్ళిపోయినవాళ్ళని సత్యాగ్రహులుగా వాళ్ళ సైనిక శాసన ప్రకారం శిక్షించటం జరగటం లేదు. అది లాభంగా ఉంది

ఇంత వ్యర్థంగా ఈ సత్యాగ్రహం చేస్తున్నారా? అని మీరనుకొంటారు. అడవిలో అది వ్యర్థంగా ఉందిగాని దేశంలో అది వ్యర్థంగాదు.

దేశంలో చిలువలు పలవలుగా చెప్పుకుంటున్నారు. ఈ సత్యాగ్రహాన్ని గురించి, పులులు క్రమక్రమంగా మారిపోతున్నవనీ వాటికి కొన్నాళ్ళల్లో జ్ఞానోదయం జరుగుతుందనీ, జరగకపోతే అసలు సృష్టిఏమిటనీ, లోకంలో ప్రజాభిప్రాయం పులులకు చాలా వ్యతిరేకంగా ఉందనీ, అమెరికాలో రష్యాలో గగ్గోలుపుట్టిందనీ పులులు ప్రజాభిప్రాయానికి తట్టుకోలేక లొంగినస్తవనీ. పులు లేమిటి? ప్రజాభిప్రాయ మేమిటి? అని నవ్వుతారేమో మీరు. ప్రజాభిప్రాయమంటే అనంతకోట్ల ప్రజలగుండెల్లో హృదయాందోళన. అంత హృదయాందోళన ఊరికే పోతుందా!

అందరిలో పరమేశ్వరుడేగదయ్యా ఉన్నాడు. ఈ అందరి హృదయాలూ కలిస్తే పరమేశ్వరుడే. ఆ పరమేశ్వరుడు ఆందోళనపడితే పులుల్లో మార్పు రాదా? అని ఒక వాలంటీరు చెపితే ఇంకో వాలంటీరు నవ్వాడు.

నవ్వి అన్నాడుగదా: "ఏదో ఒక సిద్ధాంతం తేలిగ్గా చెప్పవచ్చు. ఆ చెప్పటం మన నేర్పు. లోక సామాన్యబుద్ధికి

అది సమంజసంగానే కనిపిస్తుంది. అది కాదనటమూ కష్టమే. ఎందుచేతో నిజమూ ఉండదు. నీ సిద్ధాంతం అల్లాంటిది" అన్నాడు.

ఈ లెక్క ప్రకారం ప్రజాభిప్రాయమే తపస్సనంటి కొచ్చింది. తపస్సూ ఇల్లాంటిదేకదయ్యా. తపస్సుచేస్తే దేవతలు ఎందుకు బాధపడాలి. ఇల్లా ప్రజాభిప్రాయానికి యెందుకు బాధపడాలి? ఇల్లా ప్రజాభిప్రాయానికి యెందుకు బాధపడకూడదు? ఒక మనిషి గాఢంగా ఆలోచిస్తే దేవతలకు భయమూ, పదివేలమంది విచారపడితే దేవతలు ఎందుకు భయపడకూడదు అని గద్దించి అడిగాడు.

గద్దించేటప్పటికి దేవతల్కాదరికీ భయంవేసింది. వాళ్లందరూ మన మెందుకు భయపడకూడదు? అనుకున్నారు. భయపడ్డారు.

దేవతలు భయపడితే యేంచేస్తారు? వెంటనే బ్రహ్మదగ్గరకు వెళ్లారు. వెళ్లి 'ఓ పితామహా! సృష్టి స్థితి లయములకు నీవే ఆదిభూతుడవు. నీవు వేదాంతవేద్యుడవు. వేధవ పెద్దపులు లేమిటి, సూర్యచంద్రులుకూడా నీవల్లనే నడుస్తున్నారు. అని పాతిక శ్లోకాలు చదివారు.

ఆయన ఆపాటున వాళ్ళని వెంటతీసుకొని విష్ణులోకానికి వెళ్ళి విష్ణువుని కలుసుకొని శివుడిదగ్గరకు వెళ్ళాడో, శివుడిదగ్గరకే వెళ్ళి ఆయన్ని కల్పుకొని విష్ణువుదగ్గరకే వెళ్ళాడో తెలియదు. గాని బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముగ్గురూ

తత్వం నాశనం అవుతుందే. మనం జోక్యం కలిగించుకోనక తప్పదు అన్నాడు.

అని ఆ నలుగురూ కలిసి నాలుగు పులులవేషాలు వేసుకొని అడవిలోకి వెళ్ళారు. అసలు పులులు వీళ్ళను చూచి బయటకు రాలేదు.

కొరక్కలకు దయ్యాలు కనిపిస్తవట. ఆ పులులకు వీళ్లు బ్రహ్మ విష్ణు మహేశ్వరులని తెలిసింది.

తరువాత పదిరోజులు వాలంటీర్స్ సుఖంగా ఇంటికి పోయారు.

సత్యాగ్రహవిజయం జరిగిందన్నారు.

౧౯

సత్యాగ్రహవిజయం పది ఊళ్ళ పెళ్ళిమని జరిగింది. ఋషులయొక్క మహత్వంవల్ల పూర్వ మెప్పుడో ఆశ్రమాలలో క్రూరమృగాలు తమ క్రూరత్వం మానుకున్నట్టుగా వినికిడి. పుస్తకాలల్లో చదవటం. మన పుస్తకాల్లో వ్రాసినవన్నీ నిజమేనోయి.

కాని యీ పదిహేను రోజులు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు దేవేంద్రుడు వుంటూంటే అసలు పులులకు తిండి యెట్లా? అవి గుహల్లో మాడి చావాలన్నమాట. కాని భగవంతుడికి మనుష్యు లెటువంటిబిడ్డలో, మృగాలు అటువంటిబిడ్డలే కనక నాటి కన్యాయం చేస్తాడా? అందులో నలుగురు దేవుళ్ళాయె.

ఒక దేవుడైతే యేమో! వాడి యిష్టం. నలుగురైనప్పుడు ఒక డన్యాయం చేస్తే ఇంకొక డూరుకోడు. మన ప్రజా సంస్థల్లో అందుకనే కనీసం ముగ్గురైనా సభ్యు లుంటారు. ఇద్దరు కలసినా మెజారిటీ వచ్చినట్లే. అందుకని మనదేశ ములో ముగ్గురు దేవుళ్లని పెట్టారు. మనకున్న దేవతలనుకూడా ప్రజాస్వామికసంస్థమీదనే ఏర్పాటు చేశారు.

అందుకని ఈ నలుగురు దేవుళ్లు కలవటంమూలంగా అసలు పెద్దపులులు చచ్చిపోవటానికి వీలు లేకపోయింది. తక్కిన ముగ్గురికి యిష్టం లేకపోయినా శివుడికి పెద్దపులులంటే యిష్టం. ఆయన శార్దూలచర్మాంబరుడు. ఆయన భార్య శార్దూలవాహన.

మరి పెద్దపులులకు అన్నం యెట్లా పెట్టారని? కొన్ని లేళ్లని వాటి గుహలవైపుకు తోలమారు? వీళ్లే చంపి వాటికి భోజనం పెట్టే ఎట్లా? తరమటం అంటే ఎట్లా? అందరికీ తెలిసే టట్లా? ఏదో వాళ్ళదారివాళ్లు పోతూంటే ఆ లేళ్లు భయపడి ఆ గుహలవైపుకి పరుగెత్తినట్లు. లేళ్లుమాత్రం బిడ్డలు కాదా? అంటారేమో! వాటినేమి వీళ్లు చంపారా యేమి? కాదయ్యా యింకోవిధంగా వీటికి అన్నం ఎట్లా పెట్టారు? వాళ్లేం నిల్వ పోసుకుని కూర్చున్నారా మాంసపుముక్కలు? దేవుళ్లేమిటి రాజులేమిటి ప్రజానాయకులేమిటి లోకానికి వాళ్లు సంపాదించి పెట్టారా? ఉన్నదే అటు యిటు సర్దుతారు. పరిపాలన అంటే

ఒక మహానదీప్రవాహంవంటిది. ఇక్కడ ఇసుకలంక త్రవ్వు
తుంది. ఇంకోచోట పేర్చిపెట్టుతుంది.

పదిహేనురోజులు ఈ రీతిగా సత్యాగ్రహభటులు
రావటం ఈ దేవుళ్ళయిన పెద్దపులులు మాట్లాడకుండా ఊరు
కోటం. ఈ సత్యాగ్రహభటులలో అందరూ పెద్దమనుష్యు
లుంటారా? వాళ్ళలో కొందరు వెళ్ళి వాటి-మీసాలు పట్టుకో
వేలాడారు. పులుమీద స్వారీచేశారు. తోకలమీద
కూర్చుండి చలుగుళ్లు లాగించారు. అంతటితో అయిపోలేదు.
ఈ కథ దానవాయపాలెం చుట్టుపట్ల పదిఊళ్ళలోను మారు
మ్రోగింది. పిల్లలు, పెద్దలు, స్త్రీలు అందరూ ఈ విడ్డూరం
చూచిపోవడానికి వచ్చారు. పిచ్చివాళ్లు ఊరుకున్నారా?
వాళ్ళూ పెద్దపులులమీద స్వారి మొదలెట్టారు. ఆ దివ్య
శార్దూలాలపని చాలా యిబ్బందిఅయిపోయింది. వీళ్ళందరినీ
మొయ్యక తప్పదు. ఈ సంగతి యిట్లాఉంచి వీళ్ళదుంపలు
తెగా, వీళ్ళల్లో ఎవళ్ళయినా నిజమైన పెద్దపులులున్న గుహల
వైపునకుపోతే ఏంకావాలి? అవి వీళ్ళను చంపుతవి. అప్పుడు
సత్యాగ్రహవిజయం తూతుక్కుబ్లాక్లినేక అవుతుంది. అందు
చేత ఎవళ్ళూ ఆ వైపునకు వెళ్ళకుండా చూచుకోవలసిన
బాధ్యతకూడా ఈ నలుగురు దేముళ్ళకూ తప్పిందికాదు.

ఏదో పదిరోజులపాటే గదా! ఈ శ్రమఅంతా, ఏం
చేస్తారు మరిపడక. సామాన్యప్రజలవలె వాళ్లూ వుంటే ఏ
బాధా లేదు. కావాలని వాళ్ళు దేముళ్లు ఎప్పుడైనారో ఈ

గడ్డి కరవటం ఎప్పుడూ తప్పదు. మనుష్యులకువలెనే దేవుళ్ళకూ. చూడండి ఒక మనుష్యుడు తనకు మంత్రిపదవి కావాలని పిరాయలనూరిమాటలు, లంచాలు, ప్రచారం, ఒక పక్షంలో చేరటం ఎన్ని యిబ్బందులు పడతాడు. మంత్రి అవుతాడు. ఏమి సుఖం. జీతం వస్తుంది సరే. నే నధికారిని గొప్పవాడిని అనుకొని అహంకారపడటంలో ఏమైన సుఖ ముందో మనకు తెలియదు. కాని అబ్బబ్బా, వాడుపడే కష్టాలు శత్రువుకైనా వద్దు స్వామీ! యీ మనుష్యాధికారులకే యిట్లా వుంటే దేవుళ్ళమాట చెప్పేదేముంది! వీళ్లు కొన్ని గడ్డి కరుస్తారు. దేవుళ్లూ అన్ని గడ్డీ కరుస్తారు.

ఎట్లాగైతేనేం సత్యాగ్రహం విజయం పొందింది. జైజై నినాదాలతో ఊరూర మ్రోగింది. ఆసేతుశీతాచలం పెల్లు నున్నది. అమెరికా, రష్యా ఇంగ్లండులలో ఆశ్చర్యపోబెట్టింది.

తరువాత యింకొక నెల్లాళ్లు గడిచింది. దేశమంతా చల్లబడ్డది. అందరూ సత్యాగ్రహంమాట మరచిపోయారు. ఒకరోజున ఎవరినో ఒక పెద్దపులి చంపిందన్న వార్త వచ్చింది. ఇదేమిట్రా అనుకున్నారు. చాలామంది నమ్మలేదు. మళ్లీ అయిదారు నెలలు గడిచేటప్పటికి పులులవ్యవహారం పూర్వపు మెట్టు నందుకున్నది. ఈసారిమాత్రం వాళ్ల పుణ్యమాఅని ఎవడి మనస్సులోనూ మళ్లీ సత్యాగ్రహపు ఊహ రాలేదు. ఈ సమస్య న్యాయంగా పరిష్కరింపబడే రోజులు వచ్చినవి.

అంటే! ఇప్పుడు దానవాయిపాలెం జగత్ప్రసిద్ధమైన పేరై పోయింది. చరిత్రలో పానిపట్టు, తళ్ళికోట వాటర్లూ మొదలైన పేర్లెట్లా శాశ్వతమైపోయినవో దానవాయిపాలెం పేరుకూడా శాశ్వతమైపోయింది. 'దానవాయిపాలెం సత్యాగ్రహం' అన్నమాట తెనుగువాళ్ళకి ఒక ఎన్‌సైక్లోపీడియా అంటూ పుడ్తే అందులో చేరుతుందని ఆశ పన్నది. అదంతా భవిష్యద్విషయం. ప్రస్తుత విషయం ఏమిటంటే అధికారులకు దానవాయిపాలెంఅంటే ఎక్కడలేని గౌరవంవచ్చింది. రెవిన్యూ ఇనస్పెక్టర్లు, తాసిల్దార్లు, కలెక్టర్లు గవర్నర్లదాకా దానవాయిపాలెంనుండి కాగితం వస్తే చాలు మినిట్లమీద పనిజరిగిపోతోంది.

మళ్ళీ దానవాయిపాలెం చుట్టుపట్ల పులులు గందరగోళం మొదలుపెట్టిందనేటప్పటికి యేమి చెప్పాలి? సత్యాగ్రహంలో మహత్యం లేదనాలా? దానికి కారణం వెంటనే కుదిరింది. ఇప్పటి పులులు సత్యాగ్రహంనాటి పులులు కావు. కనుక వాటికి సత్యాగ్రహంయొక్క తపశ్శక్తి తెలియదు. ఇవి వేరే కొత్త పులులు. మళ్ళీ వీటికోసం క్రొత్తగా సత్యాగ్రహం ప్రారంభిస్తే మళ్ళీ ఒక వెయ్యిమంది సత్యాగ్రహభటులు చచ్చిపోయినప్పుడుగద్దా వీటికి జ్ఞానోదయం కలగాలి. పదిపులులకు జ్ఞానోదయం కలిగించటంకోసం వెయ్యిమంది మనుష్యులచొప్పున చస్తూఉంటే యీ మనుష్యలోకం బాగుపడేదెల్లాగా? బతికిఉన్న నాలుగుపోజులు పెళ్ళాంబిడ్డలతో

సుఖంగాఉండాలని చూస్తాడా మనుష్యుడు? పులులకు తోడే
ళ్ళకూ జ్ఞానం కలగడానికి ప్రయత్నిస్తాడా మనుష్యుడు? పైగా
ఇది హిందూ దేశములో జరిగిన వ్యవహారం. జీవులు వాళ్ళ
వాళ్ళ కర్మానుసారంగా పుట్టూ ఉంటారు. చస్తూ ఉంటారు.
దుష్టసంహారం శిష్టరక్షణం భగవంతుడు చేసుకొంటూ
ఉంటాడు. వాడుమాత్రం మనద్వారా చేస్తాడా? అంటే?
మనద్వారానే చేస్తా డనుకోండి. ఇదివరకు పులులకు జ్ఞానో
దయం కలిగిందంటే మనుష్యులద్వారానే కలిగిందిగా! అంటే
ఆ పనికి పూనుకున్న మనుష్యులున్నారన్నమాట. ఇప్పుడు
పూనుకునేవాళ్లు లేరన్నమాట. రోజూ చచ్చేవాడికి యేడ్చేవా
డెవడు? ఏదో ఒకసారంటే సత్యాగ్రహంచేశాం. ఇహ బ్రతికున్న
న్నాళ్లు మా బ్రతుకంతా ఈ పులుల సత్యాగ్రహమేనా ఏమిటి?

అయినా యిప్పుడు సత్యాగ్రహంయొక్క అవసరం
లేందే. అప్పుడంటే అధికారులందరూ మాకు వ్యతిరేకంగనుక
సత్యాగ్రహం చేయ్యవలసివచ్చింది. ఇప్పు డధికారులందరూ
మా కనుకూలమేగా. పది హేను రోజులు తిరగలేదు. కాగితాల
మీద ఆర్డర్లుపడిపోయినవి. రాజుగారు నాలుగువందలమంది
సైనికుల్ని దానవాయిపాలెం అరణ్యాలకు పంపించారు. మను
ష్యులను ఈ పులి తింటుంది, ఈ పులి తినదు అని విచక్షణ
లేకుండా కనిపిస్తే కాల్చివేయమన్నారు. అబ్బో! సైనికులంటే
మెట్లాటివారనుకున్నారు. చూచిరమ్మంటే చాలు కాలిం
వస్తారు. మరి కాల్చేరమ్మంటే!

సైనికు లేం చేశారంటే! కనబడ్డ పెద్దపులినే చంప లేదు. చిరుతపులుల్ని తోడేళ్ళనుకూడా చంపారు. అంతే కాదు. దూరాన లేడి కనుపించిందనుకోండి. అదిగూడా పెద్దపులే అనుకోటం, కాల్చివేయటం. తీరా చూస్తే లేడి. మరి ఎందుకు కాల్చారని అడిగేవాడు లేడు. దానికి "సైనిక క్రియ" అని పేరు; దాని కప్పీలు లేవు.

అయితే పులులన్నీ చచ్చిననా? అని అడుగుతారు. చావలేదు. పూర్వము అన్ని గ్రామికీలుకొట్టిన పులులు డొక్క చించేస్తాం, తోళ్లుకట్టేస్తాం అని డబాయించిన పులులు సైనికుల్ని చూడగానే తోక ముడిచినవి. చచ్చినవి చావగా తక్కినవి పోయి మారుమూలగుహలలో దాక్కొన్నవి. మరి కొన్ని పులులు తోకలు కోయించుకొని కోర్లూడగొట్టించుకొని మీసాలు కత్తిరించుకొని ఊళ్ళవెంట కుక్కలవలె తిరగటం మొదలుపెట్టినవి. ఇవిగో పులులు అంటే పూర్వపు సత్యాగ్రహాభటులు ఎబ్బే! ఇది పులి కాదంటున్నారు. ఎందుచేతనంటే! ఆ పులులు తమ గుహాలలో ఉండే డబ్బా దస్కం వాళ్ళ కివ్వటం మొదలుపెట్టినవి.

మొత్తానికి శాంతి యేర్పడ్డది. శాంతి అంటే శాంతి కాదు. మేము రాజ్యం చేస్తూన్నాం. ఒక పరిస్థితిని శాంతి అంటాం. అంటే అందరూ పరిస్థితి శాంతపడ్డదని అనుకోవాలి. అంతే.

సమాప్తము.

అంటే? ఇప్పుడు దానవాయిపాలెం జగత్ప్రసిద్ధమైన పేరై పోయింది. చరిత్రలో పానిపట్టు, తళ్ళికోట వాటర్లూ మొదలైన పేర్లెట్లా శాశ్వతమైపోయినవో దానవాయిపాలెం పేరుకూడా శాశ్వతమైపోయింది. 'దానవాయిపాలెం సత్యాగ్రహం' అన్నమాట తెనుగువాళ్ళకి ఒక ఎన్సైక్లోపీడియా వంటూ పుడ్తే అందులో చేరుతుందని ఆశ వున్నది. అదంతా భవిష్యద్విషయం. ప్రస్తుత విషయం ఏమిటంటే అధికారులకు దానవాయిపాలెంఅంటే ఎక్కడలేని గౌరవంవచ్చింది. రెవిన్యూ ఇనస్పెక్టర్లు, తాసిల్దార్లు, కలెక్టర్లు గవర్నర్లదాకా దానవాయిపాలెంనుండి కాగితం వస్తే చాలు మినిట్లమీద పనిజరిగిపోతోంది.

మళ్లీ దానవాయిపాలెం చుట్టుపట్ల పులులు గందరగోళం మొదలుపెట్టిందనేటప్పటికి యేమి చెప్పాలి? సత్యాగ్రహంలో మహాత్మ్యం లేదనాలా? దానికి కారణం వెంటనే కుదిరింది. ఇప్పటి పులులు సత్యాగ్రహంనాటి పులులు కాదు. కనుక వాటికి సత్యాగ్రహంయొక్క తపశ్శక్తి తెలియదు. ఇవి వేరే కొత్త పులులు. మళ్లీ వీటికోసం క్రొత్తగా సత్యాగ్రహం ప్రారంభిస్తే మళ్లీ ఒక్క వెయ్యిమంది సత్యాగ్రహభటులు చచ్చిపోయినప్పుడుగద్దా వీటికి జ్ఞానోదయం కలగాలి. పదిపులులకు జ్ఞానోదయం కలిగించటంకోసం వెయ్యిమంది మనుష్యులచొప్పున చస్తూఉంటే యీ మనుష్యలోకం బాగుపడేదెల్లాగా? బ్రతికిఉన్న నాలుగురోజులు పెళ్ళాంబిడ్డలతో